మానవాతీతమైన కష్టాన్ని కూడా ఎదిరించి తన మాంగల్యాన్ని రక్షించుకున్న
ఉత్తమ ఇల్లాలి కమనీయ గాథ!

విజయలక్ష్మీ మూవీస్ వారి

# ఆడజన్మ

నిర్మాత: జి.వి.యస్.రాజు
డైరెక్షన్: ఐ.యన్.మూర్తి



# ఉత్తరాలు

## కథలు

'సుమిత్ర'కథ బాగుంది— 'సుబ్బలక్ష్మి సఖుడికథ' ఏమంత బాగా లేదు. కథలో కొత్తదనం తీపిదనం లేవు. 'అడవి' కాస్త బాగానే వుంది.

నండూరి విఠల్‌గారి 'మమత' [సీరియల్] చాలా బాగుంది. పావనికి స్వామిపై ఎలాంటి అభిప్రాయం వుందో......సస్పెన్స్‌లో ఆగింది.

'ఎండాకాలం' కార్టూన్, 'లవ్ లెటర్'బొమ్మల సీరియల్ — చాలా —చాలా బాగున్నాయ్.

——సి. యస్. ఆచార్య. [హైదరాబాదు]

* * *

గుడిసేవ సుందరరామయ్యగారు రచించిన 'కథ ప్రచురించవద్దు' అను కథ చాలా బాగుంది కాలేజీ హాస్టలులో కమల ఆడిన నాటకం బాగా ప్రస్తుతానికి సరిపడినట్లుగా చిత్రీకరించారు. కథ చదివినంతసేపు చాలా మైమరపుగా ఉంది.

అవసరాల నారాయణరావ్‌గారి "తిమింగిల గిలం" ధూపాటి సంపత్కుమారాచార్యగారి కథ కూడ మంచి బాగున్నాయి.

ఆణివిళ్ళ సత్యనారాయణ [మెరకచామవరం]

* * *

22—5—70 సంచికలో ప్రచురించిన అందే గోపాలకృష్ణమూర్తిగారి 'భామినీ — బాడీగార్డు' బాగున్నది.

ఈ కథ చదివిన భామినులన్నా తమ గోపాలాలకు న్యాయం చేకూర్చగలరు.

ప్రసాద్ [హైదరాబాద్]

* * *

కథలు, గేయాలేకాదు, ఉత్తరాలు వ్రాయడంలో కూడా చాలాకష్టం ఇమిడి ఉందని ఇప్పుడిప్పుడే బోధపడుతుంది. అభిప్రాయం వ్రాయడం ఏమంత కష్టం కాకపోయినా ఉత్తరాల శీర్షికలో ప్రచురించబడిందా అని వెతుక్కుంటే ప్రచురణ కర్తమకాని ఉత్తరము నీ తాహతుఏమిటి? అని నిలదీసి అడుగుతోంది. సమాధానము తోచని హృదయం నిరాశతో నీరు కారిపోతోంది. తాహతు తెలిసే లోపల వ్యథతో మనస్సు సవాల్ చేస్తుంది. కాని, హృదయాలలో రేగే క్షోభ ఇలా అక్షర రూపాన పొదిగితే గాని మనసుకు శాంతి చిక్కదేమోనని వ్రాయవలసి వస్తుంది.

ఎమ్. జయంత్ [సికింద్రాబాద్]

* * *

15—5—70 తేదీ ఆంధ్ర సచిత్రవారపత్రికలో "నేను లేచిపోను" అనేకథ చదివిన తరువాత నేనీ ఉత్తరం వ్రాయవలసి వచ్చింది. ఈకథలో జాతి విమర్శనాత్మకమైన, అమర్యాదకరమైన కొన్ని మాటలు ఉన్నవి. ఉదా: 27వ పేజీలో మొదటి కాలంలో 4, 5 లైన్లలోని మాటలు: 'అప్పుడి కుర్రవెధవల్ని మనం వెంటాడి ఎటువంటకపోము'. 27వ పేజీలో మొదటికాలంలోని 31, 32 లైన్లలోని మాటలు: 'ఈ విషయంలో మగవెధవలు నయం.' పేరుగాంచిన మీ పత్రికలో జాతిని విమర్శించే అమర్యాదకరమైన మాటలుగల కథ మీరు ప్రచురించడం మిక్కిలి శోచనీయం. ఇకముందు మన పత్రికలో యిటువంటి అపరుష పదములు గల కథలు ప్రచురింపబడకూడదని నా విన్నపము.

డి. సత్యనారాయణ [రామచంద్రపురం]

'సుబ్బలక్ష్మి సఖుడి కథ' చాలా బాగుంది.

పార్థసారధి [కొత్తగూడెం]

## సీరియల్

29—5—70 పత్రిక వీక్లీలో నండూరి విఠల్‌గారి "మమత" చదివాక యీ ఉత్తరం రాయాలనిపించింది. ఈవారం కథలో చక్కటి సంభాషణలు ఉన్నాయి. హాస్య, గంభీర, కరుణరసాలను మిశ్రితం చేసి రాయటంలో శ్రీవిఠల్ సిద్ధహస్తులని అనిపిస్తుంది. ముఖ్యంగా 29వ పేజీలో "ఆ పరిమళాల పుత్తడి బొమ్మ. . . ." అన్నపేరా నా మనసులో హత్తుకుపోయిందంటే అతిశయోక్తికాదు.

ఇకపోతే, 'మనం ఆంధ్రులం' వ్యాసం చదివాను. నిజానికి ఎన్నోరోజులనుండి నేను మనఆంధ్రులు, వారి అలవాట్లను గురించి వ్యాసాలు రాద్దామనుకుంటూనే అశ్రద్ధ చేశాను. నేను చేయలేని పనిని చేయగలిగిన వ్యాసకర్తకు అభినందనలు.

ఏ. ఎస్. వి. ఎల్. నరసింహాచారి [కైకలూరు]

* * *

## వ్యాసాలు

"మనం ఆంధ్రులం" అన్న వ్యాసం, ఆ వారపత్రికకే కిరీటం వంటిది. ఇన్నాళ్ళకు మీ పత్రిక ద్వారా ఆంధ్రులకు ఉపయోగపడే, ఆంధ్రులు కళ్ళు తెరిచే వ్యాసాన్ని అందించిన రచయిత ధన్యుడు.

రచయిత చెప్పినట్లు "ఆంధ్రరత్నాలు"యింట ప్రకాశించవు. సోదరుడు పచ్చగా వుంటే ఆంధ్రుడు చూడలేడు. ఆంధ్రుడు తను ఆంధ్రుడు' అని చెప్పటానికి సిగ్గుపడతాడు. తెలుగులో మాట్లాడటానికి భయపడతాడు. వేరొక తెలుగువాడిని పలుకరించటానికి బిడియ పడతాడు.

ప్రవాసంలో వున్న యితర రాష్ట్రాలవారు తమ భాష తప్ప వేరొక భాషలో మాట్లాడరు. తమ భాషను అక్కడి వారికి నేర్పటానికి గర్వపడుతారు. తమ కట్టు బొట్టును అక్కడ గర్వంగా ప్రదర్శిస్తారు.

ఆంధ్రుడు తను ఆంధ్రుడని గుండెమీద చెయ్యి వేసికొని చెప్పలేనివాడు, తన సంస్కృతిని, భాషను వేరొక చోట ప్రదర్శించలేని వాడు, ఆంధ్రత్వమే నశించ వచ్చునన్న భయం ప్రతి ఆంధ్రుడికి కలగాలి ఆనాడే ఆంధ్రదేశానికి ఉజ్వల భవిష్యత్.

తెలుగు జాతి వర్ధిల్లుగాక.

——కె. వి. బదరీ ప్రసాద్,
ఇంజనీరింగ్ కళాశాల, అనంతపురం.

* * *

# ఉత్తరాలు

ప్రవాసిగారు ఆ వ్యాసంలో వ్రాస్తూ— ప్రవాసాంధ్రుడు తను ఆంధ్రుడననే విషయం మరచిపోతాడని, తన వ్యక్తిత్వాన్ని, జాతిని, సగర్వంగా చెప్పుకోడానికి సంశయిస్తాడని, ఐకమత్యంతో కలసి మెలసి వుండరని పేర్కొన్నారు. యిది అతని సంకుచిత దృష్టికి నిదర్శనంగా పేర్కొనవచ్చు. లేదా 'ప్రవాసి' అనే పేరుతో ప్రవాసాంధ్రుని గురించి తెలియని ఆంధ్రుడైనా కావాలి. నిజంగా 'ప్రవాసి' ప్రవాసాంధ్రుడై వుంటే రాష్ట్రేతరాంధ్రుల్లోని చిన్న చిన్న లోపాలు వెల్లడిచేస్తూ వాళ్ళలోని ఐకమత్యాన్నిగూర్చి, ఎంతగానో ప్రశంసించాలి.

ఆంధ్రప్రభుత్వం యొక్క సహాయ సహకారాలు లేకపోయినా తమ జాతిపట్ల, తమ దేశం ఎడల ప్రవాసాంధ్రుడికి వున్నంత—శ్రద్ధాసక్తులు బహుశా ఆంధ్రులకు లేవేమో? ప్రవాసాంధ్రుల్లోని ఐకమత్యాన్ని శంకిస్తూ "ప్రవాసి"గారు "ప్రవాసాంధ్రుల చరిత్ర చదవండి"— అన్నారు. ఎందులో చదువమంటారు? వాళ్ళ వ్యవహారాలు కళ్ళారాచూడండి—అన్నారు. మీకు చదివే అవకాశం వున్నా చూసే అవకాశం ఎటూలేదు. అందుకే మా గురించి కొంచం చదవండి.

ఖర్గపూర్‌లో 1956నకు ముందు ఆంధ్రులంటే ఆఫీసర్లు మొదలుకొని పెద్ద పెద్ద వాళ్ళు సైతం భయభక్తులతో కలసిమెలసి తిరిగేవారు. పెద్ద పెద్ద హోదాల్లో వుండేవారు. కాని యిప్పుడు .....! 1956న ఖర్గపూర్‌లో చరిత్ర సృష్టించిన ఒక—సమ్మెలో [కార్మిక ఉద్యమంలో] తెలుగు వారిని నడగొట్టేందుకై అమాయకులైన స్త్రీ పురుషుల్ని ముందు నిలబెట్టి తాము వెనుక నిల్చొని తెలుగువాళ్ళకి కొంతమంది నాయకులు, కొన్ని రాజకీయపార్టీలు ద్రోహం చేశాయి. తత్ఫలితంగా కేవలం తెలుగువాళ్ళే జైలుకి వెళ్ళాల్సి వచ్చింది. ఆనాటి నుండి తెలుగువారు అంటే అదో చెడ్డ భావం పెద్ద పెద్ద వాళ్ళలో కలిగింది. తెలుగువాడన్నా, 'రావ్'అని అనిపేరు కనిపించినా ఉద్యోగాలుండేవికావు. లేవు కూడాను. అయినా యిక్కడి ఆంధ్రుల సమైక్యత —కారణంగా తెలుగువారిని ఎవరూ ఏమీ చేయలేకపోతున్నారు.

అటువంటప్పుడు ఉద్యోగాల కోసం ఎక్కడో ఎవరో 'బోస్, ఘోస్' అని పేర్లు పెట్టుకున్నంత మాత్రాన ప్రవాసాంధ్రులంతా యిలాగే వున్నారనడం క్షంతవ్యంకాదు.

యిక్కడ 'ప్రవాసి'గారికి ఒక చిన్న ప్రశ్న? అయ్యా 'ప్రవాసి'గారు యీ బెంగాలీ పేర్లు పెట్టుకున్నంత మాత్రాన వాళ్ళందరికీ ఉద్యోగాలు దొరుకుతాయని గ్యారంటీ వుందా? వుంటే చెప్పండి తప్పకుండామేమంతా బెంగాలీపేర్లే పెట్టుకుంటాం. రాష్ట్రేతరాంధ్రులు మన సంస్కృతినిమరిచి, మన భాష మరచి, వ్యవహరిస్తున్నారని గగ్గోలు పెట్టడం తప్పితే— మా కోసం ఆంధ్రప్రభుత్వం ఏమైనా చేస్తుందా? ప్రవాసాంధ్రుడు ఏం కావాలి? మన సంస్కృతి, మన భాష అని ఆదర్శాలు వల్లించుకంటూ అడుక్కుతినాలా? యితరత్రా జాతీయుల ఎడల వాళ్ళు, ప్రభుత్వాలు యిలాగే వ్యవహరిస్తున్నాయా? ప్రవాసాంధ్రుల ఐక్యతకు నిదర్శనం కావాలంటే యింకా— చూడండి.

బెంగాల్ మధ్యంతర ఎన్నికల సందర్భంలో కాంగ్రెస్ అభ్యర్థిని గెలిపించమని శ్రీయుతులు కొంగర జగ్గయ్య ఎం. పి.గారు యిక్కడకువచ్చి ప్రవాసాంధ్రులకు వినతిచేశారు. ఫలితం అత్యధిక మెజారిటీతో ఆంధ్రులంతా కలసి కాంగ్రెస్‌ని గెలిపించారు. యిప్పుడు చెప్పండి? మాలో సఖ్యతలేకపోతే యిది సంభవమా? ఆ మధ్య కలకత్తాకి ప్రముఖ సినీ నటుడు పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు విచ్చేసినప్పుడు 40 సంస్థలు కలసి ఆయనకు పునస్సన్మానం చేసి ఘంటసాల గానకచేరి పెట్టించారు.కాదనగలరా? యిలాంటి నిదర్శనాలు కో—కొల్లలు.

యికపోతే తెలుగుజాతిపట్ల, తెలుగుసంస్కృతి పట్ల ప్రవాసాంధ్రులకున్న ఆవేదనలో ఎన్నొంతులు ఆంధ్రులకి వుంది? నిజంగా మీకన్నా ఆంధ్రులకు తెలుగుదేశం పట్ల భక్తిగౌరవాలు వుండివుంటే ఈనాడు తెలుగుదేశానికీ, తెలుగువ్యక్తులకు యిన్ని అన్యాయాలు జరిగివుండేవికావు. ఒకే ఏడాదిలో మూడుసార్లు వరదల్లో మునిగిన ఆంధ్రదేశానికి స్వల్ప మొత్తంతో మాటితుడిస్తే వూరుకునేవారు కాదు. విశాఖలో ఉక్కు ఫ్యాక్టరీ స్థాపనకై అమెరికా నిపుణులు సిఫార్సుచేసినా ఆంధ్రదేశంలో పరిశ్రమలు లేకపోయినా దాని విషయమై ఎవరు ఎదుర్కొనేవారు? యికపోతే అసలు పత్రికల—విషయం చూసుకున్నా ఢిల్లీనుండి [ప్రవాసాంధ్రుడు] వి.రామ సంజీవి మద్రాసునుండి చక్రపాణి, తదితర్లు వ్రాసే, వ్యాసాలు ఆంధ్రుల ఎంతమంది వ్రాస్తున్నారు? యివన్నీ అవలోకించి చూడండి. ఆంధ్రులకంటే ప్రవాసాంధ్రుల్లో ఐక్యత ఎక్కువనేది స్పష్టమవటం లేదా? లేకపోతే మళ్ళీ చదవండి!

'సనారా' [ఖరగ్‌పూర్]

* * *

తెనుగుదేశంలో "తెనుగు"కు అన్యాయం జరుగుతుంది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎమ్. ఏ. [తమిళం] సాయంకాలవేలలో చదివే సదుపాయం ఉంది. కానీ ఎమ్. ఏ. [తెలుగు] చదివే అవకాశంలేదు. తెనుగువాళ్ళంతా చింతించవలసిన విషయం కాదాఇది!

ఆంధ్రప్రాంతానికి మూడు రేడియో స్టేషన్ లున్నాయి. [విజయవాడ, కడప, విశాఖపట్టణము] కానీ 'తెలంగాణా' ప్రాంతానికి ఒకేఒక రేడియో స్టేషన్ ఉంది [హైద్రాబాద్] అందులోను, ఒకే రాష్ట్రంలో వున్న వారైన తెలంగాణావారు "విజయవాడ"స్టేషన్‌కు తమ రచనలు పంపే సదుపాయం లేదు. ఇక ఈ విషయంలో తెలంగాణావారు ముందుకు ఎలా రాగలరు? ఇది అందరు ఆలోచించవలసిన విషయం.

ఇక హైద్రాబాదు కేంద్రంలో అందరికీ అవకాశాలున్నాయి. అప్పుడు తెలంగాణా వారికి ప్రత్యేక అవకాశాలెక్కడ ఉన్నట్లు? విజయవాడ కేంద్రంవారు మా రచనలను ఎందుకు పరిశీలించి ప్రసారంచేయకూడదు? అనంతనరేందర్‌రెడ్డి [పరిదేల] ●


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 19–6–'70
శ్రీసాధారణనామ సం॥ జ్యేష్ఠ మా॥ శుద్ధపూర్ణిమ

సంపుటము : 63 సంచిక : 40

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

# ముసల్మానుల వోట్లకోసం ప్రచారం

ఈ దేశంలో అంతర్యుద్ధం వచ్చేస్తుంది.

ఇది భయం పుట్టించే ఆరోపణ. కఠినమయిన ఆరోపణ. కాని, కొంద కాంగ్రెసువారి ఆశలే ఈ పరిస్థితికి కారణం అవుతున్నాయని చెప్పవచ్చు, అంతర్యుద్ధం రాకుండా జాగ్రత్తపడటానికి కూడా వీలు ఉందని చెప్పవచ్చు.

ఇటీవల జరిగిన వాటిని గురించి ఆలోచించి చూడండి ఒక వయిపు కమ్యూనిస్టుల మద్దతుతో మేడమ్ ఇందిరాగాంధిగారి లౌకిక విధానాన్ని, మత దురాభిమానాల మీద ఆవె మొదలు పెట్టిన 'జెహాద్'ని లపరిచే ప్రదర్శనలు జరిగాయి న్యూఢిల్లీపత్రిక 'పేట్రియాట్' ఈ ంది విధంగా రాసింది. అది మాస్కో ఆదేశానుసారం నడుచు కునే పత్రిక అన్నది అందరికీ తెలిసిందే

'మత దురభిమానాన్ని ఖండించే ఒక సమా వేశంలో మాట్లాడతూ ప్రధాన మంత్రి అన్నారు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘం— జనసంఘం వారి ప్రచారం హిట్లర జర్మనీలో అధికారంలోకి వస్తున్నకాలంలో తాము చూసినదానిని పోలిఉందని. ముప్పయి ప్రాంతాలలో యూరప్‌లో ఫాసిజమ్ వలెనే [నేడు] జనసంఘం, రా. స్వ. సే సం లు, రెండూ దేశ స్వాతంత్ర్యానికీ, సక్రమమయిన సాంఘిక —ఆర్థిక అభివృద్ధికి అడ్డంకులుగా ఉంటు న్నాయన్నారు. మత దురభిమాన్ని ఖండించే ఒక పెద్ద వూరేగింపుతో సమావేశం ముగిసింది. మొత్తం మూడు పెద్ద జెండాలు వూరేగింపు మొదట కనిపించాయి. ఒకటి రాట్నంకల కాంగ్రెసు చర్ఖా, రెండవది సుత్తి కొడవలి కల ఎర్రజెండా, మూడవది తెల్ల చక్రంకల రిపబ్లికన్ జెండా."

## జనసంఘం సభ

అదే రోజున జనసంఘం వారు పెద్ద సమా వేశాన్ని ఏర్పరచారు. దీనిలో జగ్జీవన్‌భాయిగారి కాం గ్రెసు, శ్రీ డాంగేగారి కమ్యూనిస్టు పార్టీ, ముస్లిమ్ లీగ్— వీటి ప్రతిమలని కాల్చారు. ఈ సమావేశం గురించి పేట్రియాట్ ఏమీ రాసినట్టు కనిపిం చదు.

జగ్జీవన్‌బాయిగారి కాంగ్రెసువారు మత దురభి మానాన్ని కూలంకషంగా చర్చించారు. కేంద్ర మంత్రివర్గం కూడా చర్చలు చేసింది. మేడమ్ గాంధిగారు మాత్రం రా. స్వ. సే. సం. న్ని, జన సంఘాన్ని నిషేధించటం కష్టం అన్నారు.

తమ విదేశ పర్యటన మీద వెళ్లేముందు ప్రధాన మంత్రి రాష్ట్ర ముఖ్యమంత్రులకి ఉత్తరాలురా శారు ఈ ఉత్తరాల పాఠాన్ని విడుదల చేశారు.

## ముసల్మానుల వోట్లు

ఇదంతా రాజకీయాలకే అధికంగా సంబం ధించినది. మత కల్లోలాలని, భీభత్సాలని బలపర చటం కాదు గాని నిజం నిష్ఠూరంగానే ఉంటుంది. హైందవుల ఓట్లు పోరాదు, ముస్లిమ్ వోట్లు కావాలి— ఇదీ మేడమ్ గాంధిగారి ఎత్తు. ఈ ఎత్తు వెయ్యటం కూడా ఎక్కువగా హిందీ రాష్ట్రాలని దృష్టిలో ఉంచుకునే.

ఫాసిజమ్‌ని వెనక వేసుకు రావటం కాదుకాని కమ్యూనిజమ్ మాత్రం ఏమి తక్కువ? భారత దేశం స్వాతంత్ర్యానికీ, సాంఘిక— ఆర్థికాభివృద్ధి- అది మాత్రం ప్రమాదం కాదా? హిట్లర్ కూడా జర్మనీ సాంఘిక వ్యవస్థని నాశనం చెయ్యలేకపోయాడు కాని కమ్యూనిజమ్ వచ్చిన దేశాలన్నీ పూర్తిగా మారిపోయాయి.

కమ్యూనిస్టులే గనుక వస్తే మేడమ్ ఇందిరా గాంధిగా జ్యోతిష్కులూ, లాలా గుల్జారీలాల్‌గారి సాధువులూ, మహాత్ములూ దండగ సాపాటురాయుళ్ళు అవుతారు

## రష్యాలో మసీదులు

మరొక విధంగా నిష్ఠురమయిన నిజాన్ని చెప్పా లంటే— రష్యా మొదలయిన కమ్యూనిస్టు దేశా లలో మసీదులు ప్రభుత్వం కైవశం అయిపోతాయి. చర్చి ఆస్తులు కూడా అంతే మేడమ్ గాంధిగారి తండ్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూగారికి కమ్యూ నిజమ్ ఎటువంటిదో బాగా తెలుసు. రష్యా సాధిం చిన అభివృద్ధిని పొగడుతూనే భారతదేశం పద్ధతులే వేరు అని విసుగ లేకుండా మళ్లీ మళ్లీ చెపుతూ ఉండేవారు. భారతదేశం ప్రజాస్వామ్యం, నియం తృత్వం కాదు మేడమ్ గాంధిగారు హిట్లర్‌ని తిట్టారు గాని స్టాలిన్‌ని ఏమీ అనలేదు. కారణాలు అందరికీ తెలుసు.

ఏదయినా జరిగితే సరిగా దానికి ఎదురుగా మరొకటి జరుగుతుంది భారతదేశంలో మత కల్లోలాల చరిత్ర చూద్దాము

అలీఘర్ మహమ్మదీయ విశ్వ విద్యాలయాన్ని మహమ్మదీయులు ముందు కట్టారు దాని జరిగిన తర్వాతనే కాశీ విశ్వ విద్యాలయం ఏర్పడింది.

ఆ రోజుల్లో బ్రిటిషువారు రెండు మతాల వారికీ పేచీలు పెట్టేవారు. అయితే మేడమ్ గాంధి గారి లౌకి భారతదేశంలో మత సిద్ధాంతాలని బలపరిచే విద్యాసంస్థలు ఏమి చేస్తున్నాయి ? వాటి పేరని మార్చటానికి కొన్ని ఎల్లులక ప్రవేశ పెడ్తామన్నారు అవి ఏమయినాయి? భూస్థాపితా లయ్యాయంటారు కొందరు.

## ముసల్మానులకి అడ్డు ?

భారతదేశంలో ముసల్మానులని ఐ. ఏ. ఎస్ కి కూర్చోకుండా అడు పెడుతున్నారా? అలీఘర్ విశ్వవిద్యాలయంలో చదువుకున్న ముసల్మానులు ఎందరు భారతదేశంలోనే ఉండిపోతున్నారు? ఇంచు మించుఅందరూ పాకిస్తాన్‌కి వెళ్ళిపోతున్నారా లేదా? 1947 నుంచి భారతదేశం కర్చుమీద పాకిస్తాన్‌కి ఎందర సాంకేతిక నిపుణులు దొరకలేదు?

భారతదేశంలో మర్యాద కుటుంబాలకి చెందిన ము ల్మానులే లేరా? ఉంటే, ప్రతి రెండవ ముస ల్మానూ పెళ్లి సంబంధాలకోసం పాకిస్తాన్‌వయిపు చూపు మరలుస్తా డెందుకు?

ఉప కేంద్రమంత్రి మహమ్మద్ యూనస్ సలీమ్ గత చరిత్ర ఎటువంటిది? ఆయన హైదరా బాదు ప్రాంతం వ్యక్తి జర్మనీలో నాజీలని వేటాడి శిక్షిస్తున్నారు. రజాకార్లని గురించి పట్టించుకునేది ఎవరు?

## ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ విధానాలు

ఇక ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ సంగతి: భారత దేశంలో పారిశ్రామికాభివృద్ధిని నాశనం చేస్తు న్నది ఆయనకాదూ? ఒకవేళ ఏదయినా జరిగినా అది ఆయన ప్రయత్నాలధాటి తట్టుకుని బతికి మిగిలినదే మియ్యాన్ సాహెబ్ విధానాలవల్ల ఎగు మతులు పడిపోతున్నాయి దీనిని మార్చాలని శ్రీ బలి రామ్ భగత్ ప్రయత్నిస్తున్నారు. మియ్యాన్ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ ప్రాతికూల్యంవల్లనే ఎగుమతి విధా ం తీర్మానం వాయిదా పడిపోతోంది. ఆయన సోదరి ఒక పెద్ద పాకిస్తానీ వ్యక్తి భార్య.

భారతదేశంలో ఉంటున్న పెద్ద పారిశ్రామిక వేత్తలు ఎవరు? మొత్తంమీద ముసల్మానులు కానివారే.....

## నమాజ్—తరిఫీదు

రాజధానిలో రాయబార వర్గాలు ఉండే పేటలో ఎందరో ముసల్మానులు నమాజుకోసం పాకిస్తాన్ రాయబారవరం లోపల ఉన్న మసీదులకి వెడతారు.

అక్కడ తప్ప ఎక్కడా మసీదులు లేవా?

రాజధానిలోనే ముసల్మానులకి ఇటువంటి తరిఫీదు లభిస్తూ ఉంటే ప్రభుత్వం ఎందుకని వూరుకుంటోంది?

ఇది న్యూఢిల్లీ లేఖ. అందుకని ఇక్కడ విశ్వవిద్యాలయంలో జరుగుతున్న, జరగబోతున్న దానిని గురించి చెపాలి.

రోజువిడిచి రోజు కమ్యూనిస్టు పత్రికలు ఢిల్లీ విశ్వవిద్యాలయంలో అమెరికా గూఢచారులు స్థావరాలు ఏర్పరచు కుంటున్నారని ఆరోపిస్తూ ఉంటాయి. జూలయిలో కుడి కమ్యూనిస్టు పార్టీవారి అధ్వర్యం కింద అఖిల భారత విద్యార్థి సభ సమావేశం అవుతుందన్న విషయానికి అంత ప్రచారం లభించటం లేదు. ఈ సభలో కొన్ని పథకాలు తయారవుతాయి.

నక్సలయిటు ఉద్యమంలో పాల్గొంటున్న యువజనంతో సహకరించి వీలయినంతదాకా వారిని తమతో కలుపుకొనటం ఒక పథకం తీవ్రవాదులు ఈ విధంగా వంటరి వారయిపోతారని వీరి వూహ.

భూసంస్కరణలు, విద్యాసంస్కరణలు, విశ్వవిద్యాలయాల నిర్వహణలో విద్యార్థులు పాల్గొనటం — వీటికి సంబంధించిన ప్రచారం, ఉద్యమాలు లేవదియ్యాలని విద్యార్థి సంఘం వారు అనుకుంటున్నారు. కాలేజి వదిలి గ్రామీణ ప్రాంతాలకి వెళ్లిన కొందరు నక్సలయిటు విద్యార్థుల సహాయంతో భూములని బలవంతంగా కైవశం చేసుకొనాలని కమ్యూనిస్టు పార్టీవారి ఉద్దేశం.

## చదువు వచ్చిన మొద్దులు

"ఎంత చదివితే అంత మొద్దువి అవుతావు", అన్నాడుట మావ్‌ట్సేటుంగ్. అందుకనే విద్యార్థులు చదువు బదులు గ్రామాలలో ప్రచారం చెయ్యాలని శ్రీ మజుందార్ అన్నారు.

"పరీక్షలు పాసవటం కోసం కాలం దండగ చెయ్యకండి! భూమిలేని రయితులతో చేతులు కలపండి!" అని కూడా ఆయన ఉద్ఘాటించారు. మావ్‌ట్సేటుంగ్ పుస్తకాలతో పల్లె ప్రాంతాలకి వెళ్ళాలని ఆయన సలహా ఇచ్చారు. నలుగురు, అయిదుగురు జట్లలో ప్రయాణం చెయ్యమని ఆయన చెప్తూ ఉంటారు. నిరాడంబరంగా బతికే రయితులతో కలిసి జీవించమని అంటూ ఉంటారు. వారికి శిక్షకులు చౌ సె యుద్ధం గురించి చెప్పమంటారు.

ఇన్ని విధాల ఒక ఎర్ర దళం ఏర్పరిచి దానిని క్రమంగా ప్రజల విముక్తి సైన్యంగా మార్చాలని శ్రీ మజుందార్ ఉద్దేశం 1971 లో బెంగాలులో ఈ సేన వీర యాత్ర సాగించగలదని ఆయన నమ్మకం.

ఈ రకం ప్రమాదం గురించి మేడమ్ గాంధి గారు మాట్లాడటం లేదు. ●













# ప్రకృతి

పి. లీలావతి



మద్రాసు మెయిలు విజయవాడ స్టేషన్‌లో ఆగింది. భోరున వర్షం కురుస్తోంది. అయినా జనం గొడుగులు వేసుకుని తడుస్తూ పరుగెడుతున్నారు. విద్యార్థులు, ప్రయాణికులు, పదార్థాలు అమ్మేవాళ్ళు ఆయిల్ పేపర్లు నెత్తిమీద వేసుకుని సగం తడుస్తూ ట్రేలు పట్టుకుని అరచి అమ్ముతున్నారు.

స్టేషను రోజులాగా కోలాహలంగా— ప్రసవవేదన తీరి బిడ్డను కనినతర్వాత ఇంట్లో జరిగే హడావుడిలా వుంది.

రామశర్మగారు ఫస్ట్‌క్లాసు రిజర్వు కంపార్ట్‌మెంట్ తలుపు తీసుకుని గుమ్మం దగ్గరకు వచ్చి నిల్చున్నారు. వర్షం జల్లు బాగా కొడుతోంది. రామశర్మగారు ఖరీదైన రెయిన్‌కోటుమీద వర్షపు బిందువులు ముత్యాల్లా క్రిందికి జారుతున్నాయి నెత్తిమీదవున్న హాటు బాగా ముఖంమీదికి లాక్కుని ఆయన పేపర్లమ్మే కుర్రాడిని పిలిచి ఒక ఇంగ్లీషుపత్రిక తీసుకుని బరువైన పర్సును జాగ్రత్తగాతీసి డబ్బులిచ్చి లోపలికివెళ్ళి కూర్చున్నారు. జేబులోనుండి బంగారపు సిగరెట్‌కేసు తీసి వో సిగరెట్ వెల్గించి బయటకు చూశారు.

గ్లాసు విండోనుండి క్రిందికి జారుతున్న నీరు బయటదృశ్యాలను ఒకనిజాన్ని కప్పిపెసే అబద్ధంలా కలగాపులగం చేస్తున్నాయి.

నాలుగు రోజులైంది ఇలా గాలివానా ప్రారంభమై మానవుని అంచనాలను తల్లక్రిందులు చేస్తూ — నిప్పులు కురిసే ఈ వేసంగిలో కుండపోతగా ఈ వర్షమేమిటి ? రోళ్ళు బద్దలు కొట్టాల్సిన సూర్యుని ప్రతాపం వరుణుని ప్రతాపం ముందుతెర మరుగైనట్లు ఈ మేఘమాలికలు విజృంభించి విలయతాండవం చేస్తూ రైలు వంతెనలనూ, నది ఆనకట్టలనూ బద్దలు కొడుతున్నాయేమిటి ? వర్షం—వర్షం—ఒకటేవర్షం —మన్నూ మిన్నూ యేకంచేస్తున్న వర్షం —పరుగులెత్తే మనుష్యులను తరిమిగొడుతూన్న వర్షం — ఇదేనా కలికాలం ? ఇదేనా విపరీతం ?

రామశర్మగారు ఆలోచనలనుండి తేరుకుని పేపరు హెడ్డింగులు చూశారు. ఆ ఇంగ్లీషు పేపరు హెడ్డింగులకు తెలుగు తాత్పర్యం యిది.

'హైదరాబాదులో తిరిగి కాల్పులు'

'ఢిల్లీ రాజకీయాల్లో మరో ప్రతిష్ఠంభన.'

'రాజస్థాన్‌లో ఒక కుటుంబం ఆకలి బాధకు తాళలేక ఆత్మహత్య గావించుకున్న వుదంతం—'

'మంత్రిగారి యింటిముందు విరుద్యోగుల బైఠాయింపు.'

భళా! దేశం — ప్రజయావత్తూ అంతర్గతంగా ఏనాడో తుఫాన్‌లో చిక్కుకుంది. మనిషికీ—సమాజానికీ చక్కటి బంధమేర్పరిచే ఈ విద్యా వంతెనలు అపసవ్య విధానాలకు అరాజకీయ తుఫాను

లకు కూలిపోతున్నాయి: అయితే అతివృష్టి కాకపోతే అనావృష్టిలా తయారైనాయి పరిస్థితులు. ప్రతి ఒకడూ క్రొత్తగా నేర్చుకొన్న దేమిటంటే 'విమర్శించడం'. దేశ సమస్యలు రైలుపెట్టెలో-బార్బర్ షాపుల్లో — కాఫీ హోటళ్లలో చర్చనీయాంశాలై పోయాయి. ఇది అన్యాయం—ఇది అక్రమం అని ఆక్రోశించే కాలక్షేపపు విమర్శనాగ్రేసరులు ముందు తాము ఏపాటి దేశానికి వుపయోగపడుతున్నాము? అని ఆలోచించలేకపోతున్నారు. కాబట్టే దేశప్రతిష్ట ఇలా బజార్లో పడుతోంది—ప్రకృతి సహించలేనట్లు విపరీపు పోకడలు పోతోంది—లేకపోతే మే నెలలో తుఫానేమిటి? మగవాడు మాతృమూర్తి అయినట్లు!!

రామశర్మగారు విసుగ్గా పేపరు ప్రక్కన పడవేశారు. ఆయన కెందుకో ఆ సమయంలో మహాకవి 'విలియం వర్డ్స్‌వర్తు' గుర్తొచ్చాడు: ప్రకృతిని ప్రాణ సమానంగా ఆరాధించిన ఆ మహాకవి ఈలాటి ప్రకృతి వికృతి చేష్టలు చూస్తే ఏమంటాడో! ఆ! ఆయనే చెప్పాడు. ఒకసారి 'లెట్ నేచర్ బియువర్ టీచర్' అని—ప్రకృతి జనతగురువు. జనావళి దారితప్పితే గురువు తనకోపంతో మందలిస్తాడు. శాసిస్తాడు. నిజమే!—అదే యిప్పుడు ప్రకృతి మానవాళిని మందలిస్తోంది.

'ఏమన్నా కావాలాసార్?' పలుకరించాడు కాకీ దుస్తుల్లోవున్న ఫస్టుక్లాసు అటెండరు.

'ఏమీ అవసరంలేదు. బండి ఎప్పుడు స్టార్ట్ అవుతుంది?' అడిగారు.

'జస్ట్...ఇంకొన్ని నిమిషాల్లో అవుతుందిసార్! ఎక్కడ-ఇవాళ అన్నిబండ్లు కాన్సిల్ అయిపోయాయి హైదరాబాదు రూటులో రెండు బ్రిడ్జిలు; ఒక మైలున్నర ట్రాక్ కొట్టుకుపోయింది సార్!'

రామశర్మగారి గుండె జల్లుమంది. ఆయనకు వెంటనే భార్య సత్యవతి గుర్తొచ్చింది. తాను ఆలస్యంచేస్తే ఆవిడేమనుకొంటుందో!

'అయితే ఈ బండికేదైనా అవాంతరం రాదుగద!' ఆత్రుతతో అడిగారు.

'ఏమోసార్! బహుశా రాకపోవచ్చు. ఈ బండిని ఎలాగైనా మద్రాసు చేర్చేయాలని ఆఫీసర్లు అనుకుంటున్నారు' అన్నాడతను.

రామశర్మగారిగుండె కొంచెం కుదుటబడింది.

'థాంక్స్! మద్రాసు చంతచాలు ఎలాగైనా!!' అన్నారు.

'భోజనం పంపమంటారా సార! మళ్లీ మద్రాసు చేరేవరకూ మంచి భోజనం దొరకదు.' అడిగాడు అటెండరు.

'నో! ఆకలిగాలేదు' అన్నారు రామశర్మ.

'మీ యిష్టం' అని తను వెళ్లిపోయాడు.

రామశర్మగారు సత్యవతమ్మ గురించి ఆలోచించసాగారు. మూడుపదులు దాటి నాల్గవ పదిలోకి అడుగుబెట్టినా సత్యవతమ్మ ఆయనను ఇంకా చంటిపిల్లాడిలానే చూసుకుంటుంది. ప్రతీపనిలో ఆయనకు ఎంతో ఆత్మీయతతో సలహాలిస్తుంది. ఆమెలేనిదే ఆయన కొక్క క్షణం గడవదు. అటువంటి అర్ధాంగికి ఇన్నాళ్లకు కులాసా చిక్కిందంటే వెళ్తానంటే ఇంత అవాంతరం సంభవించడం ఆయనకు మాటిమాటికీ చిరాకు తెప్పిస్తోంది.

రామశర్మగారు బాగా కలిగినవారు. డబ్బే జీవితంలో లోటు అనుకొనేవారికి ఆయన జీవితం వడ్డించిన విస్తరి. ఆయన తండ్రి విశ్వేశ్వరశర్మగారు స్వగ్రామం వల్లభాపురం. కాని చిన్నప్పటి నుంచీ ఆయన విశాఖపట్టణంలో వుంటోన్న మావయ్య దగ్గరే పెరిగారు. అక్కడే ప్రాక్టీసుపెట్టి లక్షలార్జించి ఆ మామయ్యకూతురునే పెళ్లాడి అక్కడే స్థిరపడి పోయాడు. ఆయన ఒక్కగానొక్క కుమారుడు రామశర్మ. పుత్రుడనగా పున్నామ నరకంనుండి తప్పించువాడు గనుక రామశర్మను చాలా గారాబంగా అంతకుమించిన క్రమశిక్షణతో పెంచారు తల్లిదండ్రులు. ఆయనా చక్కగా చదువుకున్నారు. పైచదువూ, డబ్బూ—పలుకుబడీ వున్నవాళ్లకు వుద్యోగాలుదొరకడం రైళ్ళు రోజూలేటురావడంలా అతి సహజం గనుక రామశర్మకూ వో పైఅంతస్థు ఆఫీసరు వుద్యోగం వచ్చింది.

ఆ వుద్యోగం వచ్చిన మరుసటి సంవత్సరమే సత్యవతమ్మ ఆ యింట్లో ఆయన సహధర్మచారిణిగా అడుగుబెట్టింది. వారిద్దరూ ఎంతో అన్యోన్యం—ఆనందంగా వుండేవారు.

కాని—పూర్తిగా—లోటు లేకుండా—సంపూర్ణంగా ఎవరినీ సృష్టించడం చాతకాని దేవుడు బహుశా వీళ్ల కివ్వాల్సిన సంతానాన్ని ఇంకెవరో దరిద్రుడికి ప్రసాదించి వుంటాడు గనుక సత్యవతమ్మగారి కడుపు పండలేదు. ఆ వెలితి ఆ దంపతుల నిద్దరినీ మహా బాధించింది. ఆ బాధ యింతై, యింతింతై సత్యవతమ్మను సగం క్రుంగదీసి బ్లడ్‌ప్రెషర్‌లోకి దింపింది. డబ్బుకుమాత్రం లోటు లేదు గనుక మద్రాసులో దూరపుబంధువులింట ఆమెను విడిచి ఒక స్పెషలిస్టుచేత చికిత్స చేయించుకునే ఏర్పాట్లు చేసి వచ్చారు.

పదిరోజులు గడిచాక ఆ క్రితంరోజే ఆయన భార్య దగ్గరనుండి ఒక ఎక్స్‌ప్రెస్ డెలివరీ కవ రందుకొన్నాడు. ఆమెకు స్వస్థత చిక్కిందనిన్నీ, ఇక తన్ను విడిచి ఒక్కక్షణం ఈ మద్రాసులో వుండననీ వ్రాసింది. రామశర్మకూ భార్య ఎడబాటు దుర్భరంగా తోచి వెంటనే ఆమెను తీసుకురావడానికి బయల్దేరాడు.

గంట మ్రోగింది. బయల్దేరడానికి సిద్ధంగా వున్నానని సూచిస్తూ ఇంజన్ గర్జించింది. అప్పుడు గుర్తొచ్చింది రామశర్మగారికి సిగరెట్లయి పోయానని. ఆ బ్రాండ్ సిగరెట్లు మిగతాచోట్ల దొరక్కపోవచ్చు. అందుకే హడావుడిగా గుమ్మం దగ్గరకువచ్చి సిగరెట్లమ్మే కుర్రాడిని పిలచి పదిరూపాయల నోటిచ్చి వో స్టేట్ ఎక్స్‌ప్రెస్ ప్యాకెట్ తీసుకున్నారు. ఆ సిగరెట్లమ్మేవాడు చిల్లర కోసం పరుగెత్తాడు.

ఆ సమయంలో —

ఆ కొద్ది క్షణాల్లో— వాడు చిల్లర తెచ్చే లోపునే ఆశ్చర్యకరమైన, ఆకర్షనీయమైన ఒకటి రెండు సంఘటనలు రామశర్మకంట బడ్డాయి.

ఎవరో ఒకతను — మిలట్రీ మీసాలు, చారల పైజమా— గోడప్రక్కనే నిల్చుని అన్నం పొట్లాం విప్పి ఆవు రావురుమని బొక్కుతున్నాడు. అన్నానికి ముఖం వాచి

పట్టుకుంది తిననివాళ్లకం చూస్తారేమో?

కొంచెం దూరంలో—శాకాహార. పల హారశాల ముందు ఒక బిచ్చగత్తె పారే సిన ఎంగిలాకులు ఆత్రంగా ముందుకు లాక్కుని గబగబా ఏరుకుతింటోంది.

ఇంకొక అసామీ ఆ పొకెట్లమ్మే బండి దగ్గరే నిలబడి 'తైరుసాదం' (పెరుగన్నం) మహా స్పీడుగా జుర్రుకుంటు న్నాడు. ఆ కంగారు చూస్తూంటే అత నిని వెనక ఎవరో తరుముతున్నట్లు— ఆ అన్నాన్ని ఎవరైనా లాక్కుంటారేమోనని భయపడుతున్నవాడిళిమల్లే కన్పించాడు.

నవ్వొచ్చింది రామశర్మగారికి. రాత్రి మిగిలిపోయిన అన్నాన్ని పారవేయకుండా సాంబారు కలిపి పెరుగు కలిపి పొట్లాలు కట్టి అమ్ముతారట! రంగూ, రుచీ రెండూ వుండవు వాసన తప్ప' దాన్ని ఇంత ఆప్యాయంగా, ఇంత ఆతృతగా ఎలా తింటారో ఈ కొందరు??

రామశర్మగారికి ఈ ఆకలి అభాగ్యుల్ని చూస్తే అసహ్యం వేసింది. కాస్త నెమ్మదిగా తినలేరూ!

ఈ 'ఆకలి' సంగతి తెలియదుగాని ఇంకా మిగతా రకాల ఆకలి రామశర్మ గారికి తెలుసు.

ఒడిసిల్లను చూస్తే మగాడి కళ్లల్లో

# ఆకలి

ఆకలి!! అసహాయుడిని — మధ్యతరగతిని చూస్తే వడ్డీవ్యాపారికీ ఆకలి!! పెరిగి పోతున్నవాడి పర్సు చూస్తే పెరగలేని వాడికి ఆకలి!! అయిశ్వర్యంగా వుంటే ఓర్వలేని కొందరికి ఆందోళన రేపాలనే ఆకలి!!

ఈ ఆకలి కాదు రామశర్మగారు చూసింది. అసలైన ఆకలి! ఈ 'ఆకలి' కడుపు ఆకలి. దీన్ని తీర్చుకోటానికి అడుక్కోవడానికి సైతం కొందరు పెద్ద మనుష్యులు దిగజారిపోతారెందుకు? అన్పించిందాయనకు.

'దరిద్రులకు ఆకలెక్కువట' దేశమంతా ఈ దరిద్రమూ, ఆకలీ ఆక్రమించుకో బట్టే నా దేశమూ ఇంకా అండర్ డెవలపింగ్ బోర్డు తగిలించుకుని మిగతా దేశాల్ని యాచిస్తోంది?

రైలు కదిలింది. సిగరెట్లమ్మేవాడు యిచ్చిన చిల్లరను యాంత్రికంగా జేబులో వేసుకుని తిరిగి సీటులో కూర్చున్నారు రామశర్మ. సూట్‌కేస్‌లో నుండి రెండు ఆపిల్స్ తీసుకు తిని—రెండు బిస్కెట్లు చప్పరించి— ఫ్లాస్కులో వున్న బోర్న్ వీటా తాగారు. ఇవి ఆయనకు ఆకలివేసి తినలేదు. లంచ్‌టైము అయింది గనుక —రొటీన్‌గా—తిన్నారు.

అవును! రామశర్మలాటి లక్ష్మీపుత్రులకు ఆకలి వెయ్యదు ధనవంతులకు దేవుడిచ్చిన శాపమో, వరమో తెలియదు గాని సరిగ్గా ఆకలి వెయ్యదు. బహుశా వారి డబ్బు వాళ్లకు సృష్టించిన అనేక ఆలోచనలు వారి ప్రేగుల్ని బలహీనం చేసి వారిలో ఆకలిని శక్తిహీనం చేస్తుందో లేక — వాళ్ల ధన దర్పం సోమరితనాన్ని పెంచి — ఆ పెరిగిన సోమరితనం ఆకలి మాంద్యాన్ని కల్గిస్తుందో చెప్పడం కష్టం.

అందుకే రామశర్మగారు ఒక్కోసారి పై ఆఫీసర్లు కలిసినపుడు 'గోల్డ్ వాక్'లాటి ఫారిన్ సీసాని సగం ఖాళీచేసి రెండు చిప్సు నోట్లో వేసుకుని ఆ రోజుకి అదే భోజనం అని సరిపెట్టుకోగలరు. రెండున్నర రూపాయలు పెట్టి ఎయిర్‌కండిషన్డు మీల్స్ హోటల్ రూంలో కెళ్లి రెండు చెమ్చాలు తిని స్టైయిల్‌గా బయటకు వచ్చేసి భోజనం అయిపోయినట్లు భావించుకోగలరు. అలాటి ఆయనకు ఆకలి తీర్చుకోవటం కోసం ఒక మనిషి అవురావురు మని తింటూ వుంటే అసహ్యం వెయ్యడంలో విడ్డూరమేముంది?

* * *

ఆలోచనల్లోనే కునుకు పట్టింది రామశర్మగారికి. మళ్లీ మెలకువ వచ్చేటప్పటికే బండి ఒంగోలు దాటి చాలా సేపయింది. ఇంతలో వో చిన్న స్టేషన్లో బండి ఆగిపోయింది. ఈ అతిచిన్న స్టేషన్లో మెయిల్ ఆగటమేమిటి? అని సందిగ్ధంలో పడిన కొందరు ప్రయాణికులు వర్షంలోనే బయటకు రాసాగారు. 'ఆ! ఏదో క్రాసింగ్ వుండి వుంటుందిలే అని కొందరు తమ సీట్లో నుండి కదలకుండానే సరిపెట్టుకున్నారు.

రామశర్మగారు కూడా బండి ఆగిన కారణం కనుక్కొందామని బయటకు వచ్చారు. అక్కడ ఎవరో అనుకుంటున్న మాటలు విని ఆయన గుండెలు గుభేలు మన్నాయి. వెంటనే అటెండరును పిల్చి అడిగారు.

'క్షమించండి సార్! ఇక బండి

## కూరలూ గుణాలూ:

# పొట్లకాయ

ఇది మిక్కిలి పథ్యమయిన కూర. శరీరానికి సమశీతోష్ణాన్ని కలుగ జేస్తుంది. సులభంగా జీర్ణమవుతుంది. బాగా ఆకల్ని పుట్టిస్తుంది. త్రిదోషాల్ని (వాత పిత్త శ్లేష్మాలు) హరిస్తుంది. కఫపైత్యాన్ని, క్రిమి రోగాన్ని, ఆమవాతాన్ని పోగొట్టడానికి తోడ్పడుతుంది. పైత్యవాతాలను అణచివేస్తుంది. వీర్యపుష్టి నిస్తుంది. శరీరంలోని వేడిని తాపాన్ని పోగొట్టి చలవ చేస్తుంది.

శ్లేష్మవాతాలు గలవారు అధికంగా తింటే హాని చేస్తుంది. దీని దుర్గుణాలకు విరుగుళ్లు : 1. గరమసాల, 2. ఆవగుండ, 3. ఆగాకర కాయలు, 4. దోసకాయలు.

సేకరణ :—ఆకుండి నారాయణమూర్తి.

ముందుకు వెళ్లదు. వాతావరణం అతి భయంకరంగా వుంది. రైలు వంతెనలు రెండు కూలిపోయాయి. రైలు కట్టకు అనేక చోట్ల గండ్లు పడ్డాయి. ఉప్పుగుండూరు — సింగరాయకొండల మధ్య ఏరు పొంగి రైల్వే లైను తుడిచిపెట్టుకుపోయింది. ఈ స్థితిలో బండి ఒక్క అడుగైనా ముందుకు కదలడం అతి ప్రమాదకరం. అసలు డ్రైవరుకు ట్రాక్ కన్పించడం లేదు' అన్నాడు.

రామశర్మగారికి గుండె జల్లుమంది. అంతవర్షంలోనూ ఆయనకు చిరుచెమట్లు పట్టాయి. అక్కడ నిల్చోలేక తన సీట్లోకి వెళ్లి కూలబడ్డారు.

తమ రైలును డిటెయిన్ చేశారన్న వార్త ప్రయాణీకుల్లో కార్చిచ్చులా వ్యాపించింది. అంత వర్షంలోనూ ప్రయాణీకులు గుంపులు గుంపులుగా చేరి తమకు కలిగిన దురదృష్టం గురించి ఎవరికి తోచిన విధంగా వారు చర్చించుకోసాగారు. అందరి మొహాల్లోనూ ఆందోళన స్ఫుటమౌతోంది. దిక్కు తోచడం లేదెవరికీ! కొందరాడవాళ్లు ఏడుపు మొదలుపెట్టారు. ఎందుకు బయల్దేరాము రా భగవంతుడా! అని కొందరు తమకు తామే తిట్టుకుంటున్నారు ఇంటి దగ్గర తమ భార్యాబిడ్డలు ఏమౌతారో అని భర్తలు, తండ్రులు బెంగపడితే — తనతో ప్రయాణం చెయ్యకుండా ఇంటి దగ్గరవుండిపోయిన పిల్లల్ని తలుచుకొని కొందరు తల్లులు కుమిలిపోతున్నారు.

రాకరాక వచ్చిన ఒకే యింటర్వ్యూ అందుకోలేకపోతున్నానని ఒక నిరుద్యోగి ఏడుస్తే — ఎల్లుండి బెంగుళూరులో గుర్రాలు పరుగెత్తేటప్పుడు వుండలేనేమో అని ఇంకొక జూదరి వాపోతున్నాడు.

ఇలా రకరకాల వ్యధిత హృదయాలతో స్టేషనంతా భీభత్సంగా — కోలాహలంగా — భయానకంగా వుంది.

రామశర్మకు దిక్కు తోచడంలేదు. ఈ తుఫాను ఉగ్గే సూచన కనబడటం లేదాయనకి. ఈ ప్రకృతి ప్రళయం ఏనాటికి ముగుస్తుందో తెలియదు. తిరిగి భార్యను చూసేటప్పటికి ఎన్నాళ్ళు పడుతుందో అని మథనపడుతున్నారు.

* * *

మెయిల్ డిటెయిన్ అయింది అతి చిన్న పల్లెటూరు స్టేషన్లో. అక్కడ వుండాల్సినవో అతిచిన్న హోటలు మూసేశారో, కొట్టుకుపోయిందో తెలియదు ఈ వర్షం దెబ్బకు అందుకని మిగతా చాలా మంది ప్రయాణీకులు ఏసుస్తున్నా తన దగ్గర మిగిలిన పళ్లూ బిస్కట్లూ తినేశారు రామశర్మ.

ఆరోజంతా వర్షం తగ్గలేదు సరికదా ఎక్కువైంది. రామశర్మ పడుకొందామని తన కంపార్ట్‌మెంట్' చేరారుగాని అవసవ్యమైన ఆలోచనలతో — వచ్చిపోయే ఆందోళిత మనస్కులైన ప్రయాణీకులతో ఆయనకు నిద్రపట్టలేదు.

ఆ మరుసటిరోజు వుదయం పదిగంటలైంది.

ఆరోజు—...సరిగ్గా—

పన్నెండు గంటలకు—

రామశర్మగారికి ఒక నూతన విషయం అవగతమైంది.

ఆయన కడుపులో ఏదో మండుతున్నట్లు—...

ఎలుకలు ఇటూ అటూ పరిగెత్తినట్లు—...

ఆయనకేదో నిస్సత్తువ కల్గినట్లు—

—...అన్పించినపుడు—...

హఠాత్తుగా నలభై రెండేళ్ళకి జ్ఞానోదయమైనట్లు పలవరించారు — ఒకటేమాట—...

—ఆ...క...లి!...!

రామశర్మకు భరించరాని ఆకలి వేస్తోంది. ఎవరో మూడవ తరగతి ప్రయాణీకురాలు ఆ వర్షంలోనే పుల్లలేరుకువచ్చి ప్లాట్‌ఫాం ప్రక్కగా మూడు రాళ్లువేసి మంటచేసి ఒక దోసెడు బియ్యం వుడికించి తన పిల్లలిద్దరికీ పెడుతోంది. వాళ్లు ఆవురావురుమంటూ తింటున్నారు. రామశర్మగారి కెందుకో వాళ్లనలా చూస్తుంటే అసహ్యం వెయ్యలేదు — సరిగదా — తనువెల్లా పులకరించి పోయింది.

ఆయన ఆకలి అధికమైంది. తటాలున వారి ముందుకువాలి ఆ మల్లెపువ్వులా— వేడి పొగలు చిమ్ముతూన్న అన్నం లాక్కుని గబగబా తినెయ్యాలన్పించింది. కాని ఆ తలపు రాగానే ఆయనెందుకో తనలోతానే సిగ్గుపడిపోయాడు. వెంటనే తన కంపార్ట్‌మెంటులోకి వెళ్లి తన పాకెట్‌లో తినగా మిగిలిపోయిన బిస్కెట్లు తిన్నారు. కాని అవి ఎందుకో ఆయనకు తృప్తికరంగా లేవు. అవి ఆయన ఆకలి తీర్చలేకపోయాయి. పళ్ళు, బిస్కెట్లు, జామ్‌లు ఇలాటి నవనాగరికపు తండ్లు ఎన్నైనా కాస్తంత చక్కటి భోజనానికి



పాటేరోవని ఆయన ఆ కొద్దిసేపటి అనుభవంలోనే తెలుసుకున్నారు.

ఆకలి అధికమైనకాలం గంటల్ని మింగేస్తూ త్వరగా పరుగెడుతోంది. సమయంగడిచేకొద్దీ రామశర్మగారి ఆకలి రాక్షసిలా విజృంభిస్తోంది. మనిషి తోటకూర కాడలా వాలిపోతున్నాడు. కాని చిత్రమేమిటంటే — ఆయనకు ఆకలిబాధ ఎంత అధికంగా వున్నా ఎన్నడూ తనెరుగని ఈ అనుభవం ఛాయలు ఆ బాధలో కొంచెం మాధుర్యాన్ని చిలికించలేక పోలేదు. అలా చిలికించినపుడల్లా ఆయన ఎంతకాలం ఆకలి మాధుర్యాన్ని యెరుగక వృధా అయినదోనని చింతిస్తున్నారు. అంతేగాక ఆయనకు చిన్నతనంలో తల్లిచేసే కొబ్బరి పచ్చడి, ఆవకూరా, గుత్తివంకాయకూరా — కాకరకాయ వేపుడూ — గోంగూరపచ్చడి గుర్తుకు రాసాగాయి. అలా అది గుర్తొచ్చినపుడు మరీ ఆకలి అధికమౌతున్నది.

ఆ సాయంత్రం —

రెండుగంటలకు రైల్వేవాళ్ళు ప్రయాణీకులకు భోజనం సమకూర్చారు. సమకూర్చారు అనడంకంటె పంచారు అంటే బాగుంటుంది. నాలుగుబుట్టల్లో సాంబారు కలిపిన అన్నంపాకెట్లు వచ్చాయి. అందరూ ఎగబడ్డారు వాటిమీదికి. స్టేషను మాస్టరు అందర్నీ క్యూలో నిల్చోమని ప్యాకెట్లు పంచుతున్నారు. రామశర్మకు అలా అన్నం ప్యాకెట్టుకోసం క్యూలో నిల్చోవడమంటే సిగ్గేసింది. ఆత్మాభిమానం అడ్డొచ్చింది.

అందుకే ఆయన తన సీట్లోనే కూర్చున్నారు. స్టేషన్ మాష్టారు తనవంతు ప్యాకెట్ తీసుకొచ్చి తనకిస్తాడనే విచిత్రభమను సృష్టించుకొని చాలాసేపు నిరీక్షించారు. కాని స్టేషను మాష్టరు ఆ ప్యాకెట్ల పంపకం గొడవలో పూర్తిగా మునిగిపోయాడు. తన భ్రమ చివరకు తనను ఆ ఒక్క ప్యాకెట్టుకూ దూరం చేస్తుందని తెలిసి ఆయన ఆత్మాభిమానాన్ని చంపుకొని క్యూలో చివరకు వెళ్ళి నిలుచున్నారు ప్యాకెట్టుకోసం నిరీక్షిస్తూ.

ఆ క్యూలో బీదలున్నారు. ధనికులున్నారు. పూటకు గతిలేనివాళ్ళున్నారు. కోటికి పడగలెత్తినవాళ్ళున్నారు. పట్టెడన్నం లేనివాళ్ళున్నారు — హోటల్ ప్రొప్రయిటర్లు — రైస్‌మిల్లు ఓనర్లు వున్నారు.

దైవలీల! ప్రకృతి కన్నుతెరిస్తే — ఆకలి ఆకారం ధరిస్తే మానవుల్లో తారతమ్యాలు నశిస్తాయి. బీదాగొప్ప భేదాలు ఒకే క్యూలో అంతరించి పోతాయి.

తనందుకున్న ప్యాకెట్టును తన సీటుదాకా తీసికెళ్ళే సహనంపోయింది రామశర్మకు. అక్కడే విప్పి ఆవురావురుమంటూ తినసాగేరు. ఆ క్షణంలో ఆయనకు విజయవాడ ప్లాట్‌ఫారంమీద మిలట్రీ మీసాలూ, బిచ్చగత్తె తళుక్కుమన్నారు ఆ జ్ఞాపకాలు ఆయనను విచిత్రంగా చలింపజేశాయి ఏదో కొత్త సత్యం గోచరించినట్లయింది.

ఆయన ఆకలి తీరలేదు. వెళ్ళి స్టేషన్ మాష్టర్ని పిల్చారు.

'ఏం కావాలండీ' అన్నాడు స్టేషన్ మాస్టరు వినయంగా. రామశర్మగారి ధనికవేషం అతనిలో ఆ గౌరవం కల్గించింది.

'అబ్బే! ఏం లేదండీ ... అహ ... కాదు...' ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తెలియక తికమక పడ్తున్నారాయన.

స్టేషను మాష్టరుకు నవ్వొచ్చింది.

'చెప్పండి...ఫర్వాలేదు...మళ్ళీ నాకు పనుందవతల' అన్నాడు.

రామశర్మ తనకు తెలిసిన విధానంలో చెప్పదల్చుకున్నారు. వెంటనే కోటు జేబులో చెయిపెట్టి బయటకు తీశారు. స్టేషన్‌మాస్టరు కళ్ళు జిగేల్‌మన్నాయి.

'చూడండి మాష్టారూ! ఇవన్నీ మడత నలగని వందరూపాయల నోట్లు. ఇలాటివి నా దగ్గర చాలా వున్నాయి. వీటికి ప్రపంచంలో ఎంత విలువవుందో మీకు తెలుసు. వీటికి అన్నివేళలా విలువ వుంటుందని నేననుకొనేవాణ్ణి. కాని ఇవికూడా కొన్ని సమయాల్లో వ్యర్థ నిరుపయోగమని, గడ్డిపోచకన్నా విలువ చెయ్యవని నేను ఇప్పుడే గ్రహించాను.'

ఆయనచెప్పే వుపోద్ఘాతం దేనికో ఆ ముసలి స్టేషన్‌మాష్టరు కంతు బట్టలేదు.

'చూడండి మాష్టారూ!' క్షణం ఆగి అన్నారు రామశర్మ 'ఈనాడు యింతడబ్బు వుండికూడా నాక్కలిగిన ఆకలిని తీర్చుకోలేక పోతున్నాను — క్షమించండి ... దయచేసి ఎంతడబ్బు కావాలో తీసుకుని ఆ భోజనం ప్యాకెట్టు ఒకటి యివ్వగలరా?' ఆఖరివాక్యం పలుకుతున్నప్పుడు ఆయన కంఠం జీరవోయింది.

స్టేషన్ మాష్టరుకు అర్థమైంది.

'చూడండి... మీరు సున్నిత హృదయులు ... మీలాటివాళ్ళు ఒక్క సంఘటనకే చలించిపోతారు. ఐతే — ఒక్కటి మాత్రం నిజం — మీ రన్నట్లు డబ్బు దేముడుకాడు డబ్బుతో అన్నివేళల్లో అన్ని కొనుక్కోలేము. ఆలోచించండి...మీరు కనీసం కన్నెత్తయినా చూడని భోజనంకోసం మీరెంత డబ్బయినా దారపోయడానికి సిద్ధంగా వున్నారు. కనుక — ఆకలికన్నా — ఆ ఆకలి తీర్చే ఆహారంకన్నా మీ డబ్బు విలువైంది కాదు ఈ క్షణంలో.'

రామశర్మ తలవూపి చిర్నవ్వుతో డబ్బుచేతిని ఆయన ముందుకు జాపారు. కాని స్టేషన్‌మాష్టరు చేతోనే వారించాడు.

'సారీ సర్! తుఫానులో చిక్కుకుని అలమటిస్తోన్న ప్రయాణికులకు రైల్వేవాళ్ళు ఏర్పాటుచేసిన భోజనం యిది. మేము వుచితంగానే యివ్వాలి. తుఫాను యివాళ వుంటుంది, రేపు పోవచ్చు కాని అయాచితంగా లభించే లంచానికి ఆశపడి నేనింకొకరి నోటివద్ద కూడు పడగొట్టి మీ కడుపు నింపలేను. అది నాచేతకాదు — ఐయామ్ ఎక్స్‌ట్రీమ్లీ సారీ!'

స్టేషన్ మాష్టరు వెళ్ళిపోయాడు.

కొత్త మనష్యులు ఇంకా కొద్దిమంది లోకంలో వున్నారని రామశర్మకు ఆరోజే తెలిసింది. ముగ్ధుడై — వివశుడై — విచిత్రంగా చూశాడు ధనానికి లొంగని ముసలి స్టేషన్ మాష్టరు వైపు.

* * *

మరి మూడురోజులకుగాని తుఫాను తగ్గలేదు. ఆ మూడురోజులూ రామశర్మకు రైల్వేవాళ్ళు ఏర్పాటుచేసిన భోజనం తినక తప్పలేదు.

వర్షంతగ్గి రూట్ బాగుపడ్డాక తిరిగి

బండ్లు బయల్దేరాయి. జీవితంలో మరువ లేని ఒక చక్కటి అనుభవాన్ని సేక రించుకుని రామశర్మగారు మద్రాసు చేరారు. సత్యవతమ్మగారికి భగవదను గ్రహంవల్ల కులాసా చిక్కింది. తిరిగి ఆమెతో రామశర్మగారు విశాఖపట్నం బయల్దేరారు.

* * *

రైలు విశాఖ చేరినతర్వాత రామ శర్మగారు భార్యను వెంటబెట్టుకుని జనాన్ని తప్పించుకుంటూ ముందుకు వెళ్తున్నారు

'కాఫీ...టీ' 'పత్రిక...వీక్లీ'

'కూలీ...కూలీ...' 'బాబూ...పైసా'

'గుడ్డోడిని! ధర్మం చెయ్యండి బాబూ!'

ఇలాటి అరుపుల్ని అతి నిర్లక్ష్యంగా వింటూ పోతున్నా రామశర్మగారు చటుక్కున ఆగారు రామశర్మగారి ముందు ఒక కుర్రాడు నిల్చున్నాడు. బాగా నీరసంగా వున్నాడు—పొట్టంతా రేగి పోయివుంది.

'సార్! ఏదన్నా వుంటే సాయం చెయ్యండి...ప్లీజ్—' అని కంఠం దీనంగా పలికింది.

రామశర్మగారు 'వెళ్ళు...వెళ్ళు...' అని చీదరించుకుని ముందుకువెళ్లారు. వెనక నుండి అతని కంఠం వినబడుతోంది.

'మూడురోజులనుండీ అన్నం లేదు ... ఆకలిసార్ ఆకలి—ఈ ఆకలి భరించలేక పోతున్నాను'

సడన్‌బ్రేకు వేసినట్లు ఆగిపోయారు రామశర్మ. చటుక్కున వెనక్కి తిరిగి ఆ యువకునివైపు పరుగెత్తారు. అతని ఎదుట నిలబడి పరీక్షగా చూశారు.

'సార్! బియ్యే ప్యాసయ్యాను. మాది నెల్లూరు. అతి కష్టంమీద ఓ వుద్యోగం ఇంటర్వ్యూ కొస్తే వచ్చాను. వుద్యోగం రాలేదు. వెళ్లడానికి డబ్బులేదు—మూడు రోజులనుండి అన్నంలేదు—ఆకలి—'

'ఏళ్ళదంత అబద్ధం ... మోసం... అడుక్కోవడంలో ఇదొక కొత్తఫ్యాషన్...' అని ఇంకా ఏదో చెప్పబోతోన్న సత్యవతిని చేత్తోనే వారించారు రామశర్మ. ఆయన మనసులో 'ఆకలి' అని ఆ కుర్రాడన్నమాట సుళ్ళు తిరుగుతోంది. జేబులో నుండి అయిదురూపాయల నోటు తీశారు.

'చూడబ్బాయ్! నువ్వు అబద్ధం చెబు తున్నావో నిజం చెబుతున్నావో నాకు తెలియదు. ఒక్కటి మాత్రం నిజం ఏమిటంటే... నువ్వు ఆకలితో వున్నావు... నీ వాలకమే చెబుతోంది నీ కడుపులో రగిలే ఆకలిగురించి...వెళ్ళు... ఈ డబ్బుతీసికెళ్లి తృప్తిగా భోంచెయ్'

ఆశ్చర్యంతో స్తంభించి పోయిన భార్యనీ ఆకుర్రాడినీ చూడకుండా వెనక్కి తిరిగారు రామశర్మ. ఆయన ముఖంలో బాధ, తృప్తి కలసిన ఒక చిత్రమైన హాసం తళుక్కు మంది. అయోమయంగా చూస్తోన్న భార్య వైపు తిరిగారు.

'సత్యవతీ... అన్నీ అబద్ధంగావచ్చు కాని ఆకలి అబద్ధంగాదు, మనకూ — మన దేశానికి పట్టిన సమస్య ఆకలి—ఆహారం చాలక—ఆహారం సరిపోక—ఆకలి—ఆకలి చావ్రల్తో దేశం అలమటిస్తోంది.'

తెలియని ఆవేశం కట్టలు త్రెంచుకుని నిర్ఝరులా ఆయన గుండెల్లోనుంచి వుబుకుతోంది. ఆయన కంఠం గంభీర మౌతోంది.

'సత్యా! ఈ పరిస్థితి మారాలి, ప్రతి ఒకడూ ప్రతిపౌరుడూ నడుంకట్టి 'ఆకలి' నరకాసురుణ్ణి జయించి ప్రతిపేద హృదయంలోనూ సంతృప్తి దీపాలు వెలి గించాలి. ఆ దీపావళి జనావళి హృదిలో కోటికాంతులు నింపి దేశాన్ని పునీతం చెయ్యాలి, స్వామీ వివేకనంద చెప్పినట్లు 'నాదేశంలో ప్రతి ఒకడి ఆకలి తీరేవరకూ నేను ఎన్నిసార్లైనా జన్మ ఎత్తుతూనే వుంటాను' అని ప్రతిఒకడూ ప్రతిన చేయాలి...'

హఠాత్తుగా రామశర్మ భార్య ముఖం లోకి చూసి అన్నారు...'సత్యా! ఆ భయంకర మైన ఆకలిబాధ నేనూ ఎరుగుదును ... నిజం... ఆకలిబాధ నాకూ తెలుసు—'

సత్యవతమ్మగారికి ఆయన మాట్లాడు తున్నదేమిటో బొత్తిగా తెలియలేదు.

కాని తనభర్త చెమ్మగిల్లిన కళ్లను రుమాలుతో తుడుచుకోవడం స్పష్టంగా చూసి ఎందుకో అర్థంగాక నిశ్చేష్టిత అయింది. ●

...ఏమిటోయ్..? నరసింహం నాకు నమస్కారాలు చేస్తున్నావ్?

నమస్కారాలు మొక్కాడండి, దేవుడికి



# అడవిలో దారుణం

మనే పాలెంలో 29 ఏళ్ళ ముత్తుసామి అనే అతని భార్య మానియమ్మ జక్కేరికి చెందిన చిన్నప్ప అనే అతనితో రహస్య ప్రేమాయణం సాగిస్తుంటే అది పసిగట్టిన ముత్తుసామి ఆమెను వారించాడట. ఈ విషయం తెలిసిన చిన్నప్ప కోపోద్రేకంలో ముత్తుస్వామిని కొంతమంది స్నేహితులతో ఏమార్చి అడవికి రప్పించి అక్కడ చంపేశాడట.

# ఏనుగు కాళ్ల కింద...

బొంబాయి విక్టోరియా గార్డెన్సునుంచి తప్పించుకున్న ఏనుగు ఘీంకరిస్తూ 26 ఏళ్ళ షఫీక్ మహాతుల్లా అనే కావలా వ్యక్తిని తన తొండానికి చుట్టి పులోమని ఆకాశానికి ఎత్తి టప్పున కిందపడేసి, కాళ్ళతో పచ్చడి పచ్చడిగా నలిపి చంపేసిందట.



మీకూ స్వర్గంలో కాపలా కాయాలనుందా?.. నా దగ్గరికి రండి!!

# కఠిన ప్రశ్నలకు కఠిన చర్య

ఢిల్లీ మెయఫేర్ భవన్‌లో ఆదాయపు పన్ను పరీక్షలు జరుగుతున్నాయట. 26 వ తేదీన వుదయం 11 గంటలకు పరీక్ష ప్రశ్నాపత్రాలు పంచుతుండగా గగ్గోలు ప్రారంభమయిందట. ప్రశ్నలు చాలా కఠినంగా కొరుక రానివిగా వున్నాయని కొందరు, అధికారులు ప్రశ్నలను తమ శాఖవారికి ముందే చెప్పేశారని మరికొందరూ అంటూ హాలు లోంచి లేచి కుర్చీలు, బల్లలు, అద్దాలు, తలుపులు విరిచి నడి రోడ్డుమీద కుప్పగా పోసి, నిప్పెట్టారట. ఎవరైనా విద్య అభ్యసిస్తుంటే విద్యార్థే గదా! వి ఆర్ ఆల్ స్టూడెంట్స్!

*　　*　　*

అలహాబాదులో ఒక మాతృమూర్తి తన పిల్లలలో యిద్దర్ని చివాలున నూతిలోకి గిరాటు వేసి, తనూ ఎగిరి దూకేసిందట. పిల్లలిద్దరూ చనిపోయి, ఆమె చావుతప్పి, చట్టానికి పట్టుబడ్డది. ఈమె యింత ఘాతుకానికి పాల్పడిన కారణమింకా తెలియరాలేదు. ఇంకేమై వుంటుంది! మనకున్న ఆస్తి పాస్తులన్నీ ఏవి లేకపోడమేగా!




# దారుణ హత్య

సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషను [అపరాధ పరిశోధక శాఖ] శాఖలో వేలి ముద్రల నిపుణుడుగా పని చేస్తున్న ముల్కరాజుసిక్కా అనే ఆయన తన తమ్ముడు ఎల్. పిందర్‌సిక్కాను బహుక్రూరంగా చంపేశాడట. ఢిల్లీ రామకృష్ణపురం 238 సెక్టార్, 12 నెంబరు భవనంలో పై అంతస్తులో వుంటున్న ముల్కరాజు ఇంటికి అతని తమ్ముడు వుద్యోగాన్వేషణ కోసం వచ్చాడట. 29 వ తేదీన ముల్కరాజు తన భార్యా పిల్లలతో సహా గ్రీన్ పార్క్ రోడ్డులో వున్న చుట్టాలింటికి వెళ్ళాడట. వెళ్ళినట్టే వెళ్ళి, ఆ రాత్రి అర్ధరాత్రివేళ ఆయన ఒక్కడూ యింటికి తిరిగి వచ్చాడని, అప్పుడాయన తమ్ముడు ఒంటరిగా నిద్రపోతూ వున్నాడనీ చౌకీదారు దాన్ బహదూర్ పోలీసులకు చెప్పిన దాంట్లో వుందట. రాత్రి ఆయన మేడ మీదికి వెళ్ళిన కాస్సేపటికి పెద్ద ఆర్తనాదం లాంటిది వినిపించిందనీ, కాని అదేమిటో, ఎక్కణ్ణుంచి వచ్చిందో తెలియలేదనికూడా చెప్పాడట. శవానికి సుమారు పదిహేను గాయాలున్నాయట. తొడలలోను, పిర్రల మీద, గుండెలోనూ, చివరికి ముఖం మీదా కూడా వుండడమే గాక, నోట్లో కత్తితో పొడిచినట్లు దవడలు రెండూ చీరుకుపోయి కూడా వున్నాయట. ఈ అన్నదమ్ములకు ఆస్తి తగవుల వంటిది వుండివుండవచ్చని పోలీసు అనుమానిస్తోంది. అన్ని తలుపులూ లోపలకు వేసి, పెరటి తలుపు మాత్రం బయటికి తాళం వేసి మరీ ఆయన పరారైపోయారట. రెండు రోజులు శలవు పెట్టినాయన డ్యూటీలో కూడా చేరలేదట.

# జడ్జిగారికి గాయం

గయ కోర్టులో తన మీద జడ్జిగారి తీర్పు విన్న ముద్దాయి ఒకాయన అందుకు సిద్ధపడి, భద్రంగా దాచి తెచ్చుకున్న యిటిక రాయిని తీసి రివ్వున ఆయన మీదికి విసిరాడట దాంతో జడ్జిగారి బుర్రకి బలమైన గాయమయిందట.

# ప్రాణం తీసిన ప్రాణ స్నేహం

ప్రాణ స్నేహితుడుగా చెలామణి అవుతున్న నంజప్ప గవుండర్ తనను ఆపదలో ఆదుకుని, సహాయం చేయలేదని రాజమాన్నగవుండర్ [మిరాసుదార్] అనే ఆయన అతన్ని పొడిచి చంపేసి, ఆనక తను కూడా ఆత్మహత్య చేసుకున్నాడట. ఇది కోయంబత్తూరు జిల్లాకు చెందిన నాచ్చిపాళాయంలో జరిగింది.

# స్త్రీత్వంపై కోరిక

45 ఏళ్ళ పళనియప్పన్ అనే అతనికి తను స్త్రీగా మారాలని కోర్కె వుండేదట. ఈ కోర్కెను ఆసరాగా చేసుకుని ఓ ముగ్గురు వ్యక్తులు అతనికి ఏవో నాటు మందులు యిచ్చారట. దాంతో పళనియప్ప చనిపోయేసరికి అతని శవాన్ని ఇడక్కా మంగళం అనే వూళ్లో, రంగసామి అనే ఆతని పొలంలో పాతేసి చెక్కేసిపోయారట. రంగసామి పొలం పని చేసుకుంటుండగా యీ శవం బయటికి వచ్చి, మిగతా విషయాలను బయటికి లాగింది.

# తండ్రీ కొడుకుల హత్య

శ్రీకాకుళానికి చెందిన అలుపోల అనే గ్రామంలో సర్పంచి దువ్వాడ జగన్నాయకులు అనేఆయన,ఆయన కొడుకు రామారావు ఆరు బయట నిద్రపోతుండగా సుమారు పదిమంది నక్సలైట్లు అని చెప్పబడేవారు వారిద్దరినీ చంపేసి, యింట్లో నగా నట్రా దోచుకుపోయారట. ఆ వూరి మునసబు దువ్వాడ రామనాదం యింట్లో కూడా పడి దోచుకున్నారట—కిమర్థం....

మనం పడుకోబోయే ముందు నీకో కథ చెప్పా గుర్తుందా? దాని నీతి ఇది! ఆరు బయట నిద్రపోవరాదు!!



## సాధించిన పగ

పుర్ణియాకు చెందిన చండబారా అనే గ్రామములో కొంతమంది బందిపోట్లు పడి తమ పని చేసుకోడమే గాక వో పాకకు నిప్పెట్టి, అందులోకి వో వ్యక్తిని గిరాటూ వేశారుట. దీనితో ఆ వూరి జనం వళ్లు పొంగి, ఆ దొంగల నాయకుణ్ణి, ఆతని ముగ్గురు కొడుకులనూ కొట్టి, భగభగ లాడుతున్న మంటల్లో, పడేశారట— టిట్ ఫర్ టాట్ రివెంజ్!

## మరో ప్రపంచం?

తెల్లనివన్నీ పాలు కానే కాదు అని నమ్మకం. పీద గయలో మేజిస్ట్రేటు కొంతమంది పోలీసుల సహాయంతో ఒక ఆశ్రమంమీదికి దండెత్తేసరికి వూళ్లో కనుపించటం లేదనుకున్న వో అయిదుగురు పిల్లలు అక్కడ దొరికారట. ఆశ్రమానికి చెందిన మహారాజాదేవ్ ప్రసాద్ అనే అతనిని, మునేశ్వరీదేవి

మనమూ 'ఆలాంటి' ఆశ్రమం పెడితే... ఏ శ్రమా వుండదు!!



అనే ఆమెనూ అరెస్టు చేశారట. వీరు వో బెంగాలీ అమ్మాయిని ఢిల్లీలో ఒక వ్యాపారికి మూడు వేల రూపాయలకు అమ్మేశారట. ఆశ్రమంలో ఏ శ్రమా లేని వ్యాపారం చేస్తున్నారట వీరు. గయనే కీలక స్థానంగా పెట్టుకుని దేశంలో అన్ని మూలల నుంచి పిల్లలను ఎత్తుకుపోయే సంస్థలు నడుస్తున్నాయని అనుమానిస్తున్నారు అధికారులు...ఎంతో ముందుకు వెళ్లాం మనం అని మీసం చరుచుకు ఎటుట చూస్తే యింకా ఆంధ్రోక్తిను కాలంలోనే నన్న మాట మనమున్నది. వై....ఇంకా వెనక్కు పోటం లా!

## ఆకలి గొన్న భూమి

అలహాబాదులో సహారుల్లా రోడ్డులోని వో పార్కులో పిల్లలు ఆడుకుంటుండగా ఆ పార్కు భూమి టప్పున రెండుగా విరిగిందట. ఈ పగులుకు 8 అడుగుల అగాధం ఏర్పడిందట. అందులో పార్కులో ఆడుకుంటున్న ముగ్గురు పిల్లలు పడి పోయారట. ఇద్దరు రక్షింపబడ్డారట.





Novel Quiz No. 1 ఫలితములు :— 1. పగ, 2. విరాగి, 3. అవకాశాలను, 4. చనిపోయినాడు, 5. గొప్పవారున్నచోట, 6. పనికాదు, 7. చదువరికి ప్రేమతోనే

గొలుసు నవల

# అపరాజిత



నలుగురు రచయిత్రుల సంయుక్త రచన

నాలుగవ భాగం

నాయని కృష్ణకుమారి

### జరిగిన కథ

శ్యామల రాధలతో పాటు మాధవిని కూడా స్వంత కూతుర్లాగే పెంచింది పరమేశ్వరి. శివశాస్త్రికి మాధవి మీద కంటే మాధవి తెచ్చే జీతం మీద అభిమాన ఎక్కువ. శ్యామలకి రాజారావుతో పెళ్ళయింది. శ్యామల బిడ్డనికని కన్ను మూసింది. ఆ బిడ్డభారం మాధవిపై పడింది. ఆ యింట్లోనే అద్దెకుంటున్న మధు మాధవిని ప్రేమించాడు. మాధవిని రాజారావు పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడని తెలుసుకుని మధు కుంగిపోయాడు. రాధకి మధుకి గల సంబంధాన్ని తెలుసుకుని మాధవి ఆశ్చర్య చకితురాలవుతుంది. రాధ రాసిన ఉత్తరంలో ఆమె మనస్తత్వం పూర్తిగా అర్థమై పోయింది. రాధ గర్భవతి. తల్లి కాబోతున్నానన్న భయం ఆమెకి లేదు.

## 16

సత్యవతమ్మ చెప్తున్న ప్రతి అక్షరాన్నీ శ్రద్ధగా వింటోంది రాధ. ఆమె పెంచి పోషిస్తున్న అంతమంది అభాగినులకు మల్లే తానూ ఒక అవివాహిత మాతగా రూపొందపోతున్నది. ఆ విషయంలో రాధ ఏ దాపరికాన్నీ వాంఛించ లేదు. మాధవి సలహాను పెడచెవిన పెట్టకుండా కస్తూరి రాసిచ్చిన ఉత్తరం అందుకుని హైదరాబాద్‌లో అడ్రసు వెతుక్కుంటూ సత్యవతమ్మగారిని కలుసుకున్నది. ప్రథమ వీక్షణంలోనే నిండయిన ఆవిడ రూపూ తొణకని ఆవిడ మాటా రాధ నాకర్షించ గలిగాయి. రాధ తన గాథనంతటినీ జరిగింది జరిగినట్లుగా ఏకరువు పెట్టింది. తాను చేసిన పనివల్ల తనకు ఆత్మగ్లాని కలగటం లేదని నొక్కి చెప్పింది. లోకమంతా తన్ను ఎదిరించినా సరే తనకు పెళ్ళి కాకపోయినా మధునే భర్తగా భావిస్తున్నాననీ తన ప్రేమ ఫలంగా గర్భంలో పెరుగుతున్న పాపకు రూపాన్నిచ్చి సగర్వంగా పెంచి ఉత్తమ స్థాయిలో తీర్చిదిద్దడానికి తన సర్వస్వాన్నీ ధారపోస్తానని ఆవేశంగా చెప్పింది. ఈ లక్ష్యసాధనలో ఎవరిని ఎదిరించవలసి వచ్చినా తాను వెనుకంజ వేయనని స్పష్టం చేసింది.

సత్యవతమ్మగారిని రాధ ఆకర్షించినంత చక్కగా ఆవిడ పదేళ్ళ ఆశ్రమ పాలనా జీవితంలో ఏ వ్యక్తీ చెయ్యలేక పోయింది. ఇన్నాళ్ళూ తాను చూచిన స్త్రీలందరూ అభాగినులు. జీవితంలో ఏదో పోగొట్టుకున్నవారు. తాము చేసిన పనికి సిగ్గుపడుతూ తమ్ము తాము దూషించుకుంటూ, సంఘంలో మళ్ళీ తమకు రవ్వంత చోటు దొరికితే చాలునని పాకులాడుతున్నవాళ్ళు—రాధ అలా కనిపించలేదు. ఆవిడ దృష్టిలో ప్రేమకూ వివాహానికీ మధ్య భేదంలేదు. సంఘం ఆమోదించే వివాహ నియమాలకంటే తన మనస్సు నమ్మిన ప్రేమ సూత్రావళి మీదనే ఆవిడకు ఎక్కువ గురి. స్త్రీని ఎవరో మార్చడమూ మరెవరి చేయూత కోసమో ఆవిడ ఎదురుతెన్నులు చూడడమూ కాదు కావలసింది. స్త్రీ తనంతట తాను, సంఘాన్నీ, అది సృష్టించే సమస్యల్నీ సమగ్రంగా అర్థం చేసుకుని, కొంత ధైర్యంతోటీ, ఆత్మవిశ్వాసంతోటీ, వాటిని ఎదుర్కొనే స్థితిని సంపాదించుకోవాలి. అప్పుడే స్త్రీ జాతి చరిత్రలో అభాగినుల సంఖ్య తగ్గుముఖం పట్టడం సాధ్యమవుతుంది. ఈ రాధకు జీవితంలో వోటమి లేదు. జీవిత సాగరాన్ని తరించడంలో తను అలిసిపోవచ్చునేమో కానీ వోడిపోదు. ఏదో ఒక క్షణాన అవతలి ఒడ్డు చేరుకునే దక్షతకల రాధ విజయం సాధిస్తుంది. అపరాజిత రాధ! సత్యవతమ్మగారి కళ్ళల్లో తృప్తి మెరిసింది. నిండుగా, వాత్సల్యం తొణికే చూపులో రాధను ముంచుతూ—

'మా శిక్షణ కేంద్రంలో వో టీచరు పోస్టు ఖాళీగా ఉంది. ప్రభుత్వం ఇచ్చే గ్రేడే మేమూ ఇస్తున్నాము. ఆ ఉద్యోగంవల్ల నీ సమస్య బరువు సగం తీరినట్లే. భోజనం వగైరాలకు డబ్బు చెల్లించే పద్ధతిలో నువ్వు శరణాలయంలోనే ఉండవచ్చు. అలా నీ కిష్టం లేకపోతే వేరేగానూ ఉండవచ్చు. నిర్బంధమేమీ లేదు.' అన్నారు.

'నేను బయటే ఉండదల్చుకున్నాను.'

'మంచిదే. కాని సుకరంగా లేని మార్గంలో నడవదలచుకున్న వాళ్ళు ఎగురు దెబ్బలు తప్పించుకోవడానికి నిబ్బరంగా అడుగు ముందుకు వేయాలి.

'చెప్పండి'

'ఏమీలేదు రాధా! ఒక విషయం నీకు స్పష్టంగా తెలియాలి. నీవు నీ మనస్సు మెచ్చిన పని చేశావు కదా అని అవసరం వచ్చినా రాకపోయినా దాన్ని చాటుకో నక్కరలేదనుకుంటాను. నలుగురూ నిలదీసి అడిగినప్పుడు నిర్భయంగా నేను చేసింది తప్పు కాదని చెప్పుకోవడం అవసరమే. కాదనను. కాని అటువంటి పరిస్థితి రానప్పుడు తప్పించుకుని తిరుగుతూ అందరిలో నువ్వూ ఒకదానివై కలిసిపోయేట్లు ప్రవర్తిస్తే ఏ చిక్కూ రాదు. ఇదే నేను నీకివ్వదలచుకున్న సలహా!'

'అంటే? నా భర్త దేశాంతరంలో ఉన్నాడనో, నన్ను వదిలి పెట్టేశాడనో చెప్పమంటారు! ఆయన తాగుబోతని గూండల ముఠాకోరని కూడా చెప్పి నలుగురి సానుభూతి సంపాదించుకోమంటారా! ఈ కథనానికి బలం తెచ్చుకోడానికి మెడలో పసుపుతాడూ, నల్లపూసల దండా వేసుక్కోవద్దా చెప్పండి!' — రాధ చెంపలు ఎర్రబడి ముక్కుపుటాలు అదరడం గమనించారు సత్యవతమ్మగారు. ఆవేశపు ముద్దలా కనిపిస్తున్న రాధ మనస్సు పసిపాప మనస్సు. 'ఆవేశ పడకు రాధా! చాలా సన్నివేశాల్లో మన జీవితంలో మనం తటస్థంగా ఉండడం మంచిది. అటువంటి స్వభావమే నీ భావి జీవితానికి శ్రీరామ రక్ష అవుతుంది.' అని నచ్చచెప్ప బోయారావిడ.

రాధ ఎందుకో ఎదురు తిరగలేకపోయింది. ఈవిడలోనూ తన అక్క మాధవిలోనూ, మిడి మిడి ఎండల్లో, విశాలంగా పరుచుకున్న మహా వృక్షచ్ఛాయలా ప్రత్యక్షమయ్యే అద్భుత తత్త్వమేదో ఉంది. వీళ్లకు సమస్యలనేవి ఉండవా? ఉన్నా వాటిని ఎక్కడికక్కడ ఇతరులకు తెలియకుండానే రహితం చేసుకునే శక్తిమంతులు వీళ్లు. రాధ చప్పున లేచి—

'మరి నేను ఇల్లు వెతుక్కుని వస్తాను.' అన్నది.

* * *

'ఏమిట్రా! మరీ అంత మన్నుదిన్న పాములా తయారయ్యావ్! నువ్వు వెనకటి మధువు కావు.' అన్నాడు నరహరి.



మధు చిన్న నవ్వు పెదాలమీద తొలకరించాడు ఆ నవ్వులో అతని మనస్సు ప్రతిఫలించిన జాడ నరహరికేమీ కనిపించలేదు. ఉత్త కాగితం పువ్వులా కనిపిస్తున్న దాన్నిచూచి, ఏదో పెద్ద కథే ఉంది వెనక! అనుకున్నాడు. ఇవ్వాళ కాకపోతే రేపయినా తానా కథ వినక తప్పదు. మధుకు తనకంటే ప్రాణ స్నేహితులెవరూ ఉన్నట్లు గుర్తు లేదు నరహరికి.

'వడ్డించమంటారా!' సన్నాటి కోకిల గొంతు లాంటి గొంతు గాజుల గలగలతో శ్రుతి కలుపుతూ వినిపించింది లోపల్నుంచి.

'అవశ్యం. మేం కాళ్ళు కడుక్కుంటున్నాం. నీవని కానీ అపర్ణా!' అని బదులు చెప్పాడు నరహరి. మధు తన మిత్రుడి దగ్గరికి వచ్చి ఆవేళ్టికి నాలుగు రోజులు. ఈ నాలుగు రోజుల నుంచీ చూస్తున్నాడు నరహరి అనుక్షణమూ అపర్ణమీద ఆధారపడి జీవితాన్ని సుఖంగా గడుపుతుండడం. అనుక్షణమూ అపర్ణా, అపర్ణా, అంటూ తిరిగే నరహరికీ తాను చదువుకునే రోజుల్లో విద్యార్థి లోకానికంతటికీ నాయకుడుగా వ్యవహరించి అందరికీ అన్నివిధాలా సలహాలిస్తూ తిరిగిన నరహరికీ పోలి

# అపరాజిత

కెక్కడ? మిత్రులిద్దరికీ అపర్ణ వడ్డన సాగించింది. పొట్టిగా, కుదిమట్టంగా ఉండే ఆమెను అందగత్తెల్లో లెక్క వేయడానికి వీలులేదుగాని, ఆవిడది కళగల్ల మొహం. బొద్దుగా ఉండే ఆ మొహంలో రెండు కళ్ళూ రెండు చేపల్లా మిలమిల లాడుతూ చూపరుల్నాకర్షిస్తాయి. నరహరిని ఆ కళ్ళు ఆకర్షించాయో లేక ఆ కళ్ళ లోతుల్లో ప్రతిఫలించే ఆవిడ మనస్సు ఆకర్షించిందో! అయినా గాఢంగా ప్రేమించి ఆమె తోటిదే లోకమనుకున్న సుపర్ణను ఎలా విస్మరించగలిగాడు! ఆవిడ కిచ్చిన స్థానాన్ని ఖాళీచేసి మళ్ళీ ఆ బసలో ఈ అపర్ణనెలా దింపగలిగాడు?

మధు అలవాటుగా అన్నం తింటున్నాడేకాని అతని మనస్సు నరహరిని గురించిన పూర్వస్మృతుల్ని నెమరు వేస్తోంది.

'కొంచెం అన్నం వెయ్యమంటారా?'

'వద్దండీ! పులుసు వెయ్యండి.'

వండడంలోనూ వడ్డించడంలోనూ చాతుర్యాన్ని పుట్టుకతోనే సంపాదించుకున్నట్టున్న ఆవిడ చెయ్యి పులుసు వడ్డిస్తుంటే ముగ్ధంగా చూస్తూ ఉండిపోయాడు.

'మీ మరిదికి కొంచెం పరధ్యానం ఎక్కువై పోయింది. కాస్త కనుక్కొని మరీ వడ్డించు' అన్నాడు నరహరి.

అపర్ణ తనవేపూ, భర్త నేపూ చూపులు మారుస్తూ ఉండడం, నరహరి సన్నగా నవ్వుతూ కళ్ళతోనే ఆవిడతో మాట్లాడుతుండడం చూచి పసిపిల్లవాడిలా సిగ్గుపడి పోయాడు మధు.

'ఈ పిల్లవాడి మనస్సుకేదో పెద్ద దెబ్బ తగిలింది. లేకపోతే ఆ కళ్ళు బాణపుదెబ్బలు తగిలిన పక్షికళ్ళలా అంతలా విలవిల్లాడవు. ఇందుకేమైనా చేస్తే బాగుండును. ఆ కళ్ళల్లో ఆనంద తరంగాలు ఉవ్వెత్తుగా విరిస్తే బాగుండును.' అనుకున్నది అపర్ణలో ఉన్న తల్లిగుండె. అపర్ణకు నలుగురు పిల్లలు.

వాళ్ళు భోజనం ముగించి చేతులు కడుక్కున్నాక వక్కపలుకు అందించి వంటింట్లోకి నిష్క్రమించింది అపర్ణ. తిరిగా తనకని అమిర్చిన పక్కమీద కూర్చున్నాక నరహరి మధును కదిలించాడు.

'ఇక చెప్పు! ఇవ్వాళ్టికిది నాలుగో రోజు. నువ్వుచేసే ఉద్యోగం ఏం చేశావ్! సెలవు పెట్టావా?'

'ఏం! పొమ్మన్నావా! బండి ఎన్ని గంటలకో చెప్పు!' అన్నాడు మధు

'పరాచికాలకు చాలా సమయం ఉంది. నాకు సమాధానాలు కావాలి. కప్పదాట్లు వెయ్యకుండా బుద్ధిగా చెప్పు' సెలవెన్నాళ్ళు!'

'ఎన్నాళ్ళేం కర్మ! — ఇక అన్నీ సెలవలే!'

'అదేం! ఉద్యోగం పోయిందా! నీ దిగులు కదే కారణమా!'

'కాదు. ఉద్యోగం దానంతటది పోలేదు. నేనే ఒద్దనుకుని వచ్చేశాను.'

ఒక్క క్షణం ఏం అడగాలో చేతకాక ఊరుకున్నాడు నరహరి. మధే అందుకుని,

'నాకు తెలుసు. నాకష్టేదో విని నా కష్టాల్ని ఆర్చి తీర్చాలనుకుంటున్నావు కదూ! అసలు నేను కష్టాల్లో ఉన్నానని నువ్వెందు కనుకుంటున్నట్లు?' అన్నాడు.

'కష్టమో సుఖమో చెప్పలేను కాని,



మళ్ళీ మారావు. మునుపటి మధువు కావు. ఎప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ ఉండే నీలో ఇంత గంభీరగుణం, ఇంత మూకత్వం, ఎలా ప్రవేశించిందో అర్థం కాకుండా ఉంది. ఏదైనా ప్రేమలో పడి ఎదురు దెబ్బ తినలేదు కదా!'

'నరహరీ!'—అంత అదాటుగా ఎదుట ఉన్న మనిషిని పిలవాల్సిన అవసరం లేకపోయినా పిల్చాడు మధు. దెబ్బ తగిలిన క్షణాన పిల్లవాడు 'అమ్మా' అన్నట్లుగా ధ్వనించిన ఆ పిలుపును నరహరి గుర్తించాడు. ఇక మధు ఆగడు. అతను తన కథ చెప్పుకున్నాక నిజంగా తానేమి చేయగలడో ఆలోచించాలి.

మధు తన కథ చెప్పాడు. చెప్పి,

'ఈ కథలాంటి కథలు నవలల్లోగానీ, సినిమాల్లోగానీ ఉంటాయేమో! బహుశా అక్కడా తక్కువే సందర్భపడి ఉంటాయి. మాధవి మీద స్థిరంగా నిలిచిపోయిన నా అంతరంగం అవిడ్ని మర్చిపోలేకుండా ఉంది. కాని నేను రాధకు చేసిన అన్యాయం నన్ను నైతికంగా ఆవిడతో బంధిస్తోంది. ఇంత ఇరుకైన పరిస్థితిలో పడే ప్రేమికులు అరుదనుకుంటాను'—అన్నాడు.

'ప్రేమ అనేదో సెంటిమెంట్ మధూ! అది ఆయా మనుషుల మానసిక ప్రవృత్తి మీద ఆధారపడి రంగులు మార్చుకుంటూ ఉంటుంది. నీకు కాలేజీ రోజుల్లో, నా ప్రేమ కథ తెలిసిందే కదా!'

'ఆవునా! అడుగుదామని సంకోచించాను. స్వర్ణ ఉండవలసిన స్థానంలో ఈ అపర్ణ ఎలా వచ్చింది? ఈవిడ పరిచయం నీకెలా కలిగినట్లు?'—

'స్వర్ణ నేను లేందే బ్రతకలేనన్న రోజులు ఉన్నాయి. అలాగే, అవిడ సాహచర్యం వల్లనే నా జీవితం ధన్యమౌతుందని నేనూ గాఢంగా నమ్మేవాడిని. ఆరోజుల్లో మా మనస్సుల్లో పాతుకు పోయిన భావగాఢత అటువంటిది. మా యిద్దరి వివాహం వల్ల కుల వ్యవస్థ కూకటి వేళ్ళతో పెకలింపబడుతుందని మీలాంటి వాళ్ళంతా మాకు ప్రబోధం చేస్తోవాళ్ళు.'—

'ఛాందసమైన యూనివర్సిటీ అధ్యా




# రంగుల రాట్నం

# పచ్చజ్వరం

డా॥ కోనేటి రావు

అదృష్టవశాత్తూ ఈ జ్వరం మనదేశంలో లేదు. [పచ్చ కామెర్లకు దీనికి సంబంధం లేదు.] మలేరియా, బోదకాలు జ్వరం మాదిరిగానే ఇది ఒక జాతి దోమవల్ల వ్యాపిస్తుంది ఈ దోమని 'ఏడిస్ ఈజిప్టి' అంటారు. [క్యూలెక్స్ దోమ బోదకాలుని, ఎనాఫిలిస్ దోమ మలేరియాను అందజేస్తాయి.] పచ్చ జ్వరానికి కారకమైనది ఒక వైరస్. దీనిని ఏడిస్ ఈజిప్టి మనిషినుంచి మనిషికి అందజేస్తుంది.

క్యూబా ముఖ్యపట్టణం హవానాలో ఫిన్లే అనే డాక్టరు గత శతాబ్దంలో మొదటిసారిగా ఈ దోమ విషయంలో అనుమానపడ్డాడు. 1900లో నలుగురు అమెరికను డాక్టర్లు హవానా చేరారు— ఆయన చెప్పిందాంట్లో ఎంత సత్యం ఉందో తెలిసి కొందామని. వీరు వాల్టర్ రీడ్, జేమ్స్ కారల్, అరిస్టైడిస్ ఏగ్రమాంటి, జెస్సీలేజియర్. వాళ్ళు తమ మీదనే మొదట ప్రయోగించుకొన్నారు. ఒకాయనకి—కారల్—చావు తప్పి కన్నులొట్టబోయిన పని అయింది. పాపం లేజియర్ దోమ కాటువల్ల పచ్చజ్వరం వాతపడి మరణించాడు.

దోమల్ని నిర్మూలించడం అసాధ్యం కాబట్టి కనీసం ఇళ్ళ పరిసరాల్లో నీళ్ళు నిలవ లేకుండా చేసి చాల మట్టుకు ఈ వ్యాధిని అరికట్టారు. దక్షిణమెరికా మెక్సికో ప్రాంతాల కూడా ఈ వ్యాధి ఉంది. ఈ వార్త విని అక్కడ కూడా ఆ దోమని చాల వరకు నుటుమాయం చేశారు. అక్కడితో దాని కథ అయిందను కొన్నారు. కాని కాలేదు.

ఆఫ్రికాలో కూడా ఇదే మాదిరి వ్యాధి ఉంది. అసలు అక్కడినుంచే వలస వచ్చిన మనుష్యులద్వారా అమెరికా ఖండాలకి చేరింది. 1925లో ఆఫ్రికాలో వ్యాధి సోకిన ఒకడి రక్తాన్ని కోద్రిగా 'రీసస్' కోతి లోకి ప్రవేశపెట్టారు. ఆ కోతికి కూడా ఈ జ్వరం సోకింది. కోతు మీద ప్రయోగానికి బహుశా ఇదే నాంది. దీని వల్ల క్రమంగా ఒక భయంకర సత్యం తేలింది. ఈ వ్యాధి మానవులనించి మానవులకే కాక జంతువుల నించి కూడా దోమలు గ్రహించి, మానవులకి అందజేసే అవకాశం ఉందని గ్రహింపుకు వచ్చింది.

1932లో హైనోగామస్ స్పెగాజ్జిని అనే దోమ కూడా ఈ వ్యాధిని వ్యాప్తి చెయ్యగలదని తెలుసుకొన్నారు. అమెరికా, ఆఫ్రికా అడవుల్లోని కోతుల్లో కూడా ఈ వ్యాధి లంగా ఉందని గ్రహించారు. దోమలు కోతుల్ని కరచి వ్యాధిని వ్యాప్తి చేస్తాయి. అంతే కాక ఆ కోతులు గ్రామాల మీదకి వచ్చినప్పుడు కాని, మనుషులు అడవుల్లోకి పోయినపుడు కాని, ఆ దోమలు వ్యాధి వైరస్‌ని మానవులకు అంద చేస్తాయి.

1798లో ఎడ్వర్డ్ జెన్నర్ మశూచికి వాక్సినేషను కనిపెట్టాడు. తిరిగి ఇప్పుడు వైరస్ జబ్బుకు వాక్సినేషను పచ్చజ్వరం సందర్భంగా కనిపెట్టారు. అదే ఈ వ్యాధి రాకుండా శ్రీరామరక్ష!

వకీలు ఇదే కారణంగా నీకు అన్యాయమూ చేశారు. ఆ సంగతులు తెలుసు. కాని తర్వాత ఏం జరిగింది?'—

'పరీక్షలు రాయడంతో ఎవరి దారి వారిదే అయింది. మొదట మొదట విరివిగా వచ్చే ఉత్తరాలు మందగించినయ్. తన ఇంట్లో తండ్రి కట్టడి ఎక్కువగా ఉందనీ, ఏ పని చేయడానికీ స్వేచ్ఛ లేకుండా ఉందనీ రాసిందొకసారి. కుల వ్యవస్థ కల్పించే ఎగుడు దిగుడుల్లో, మనల్ని సంఘం సుఖంగా బతకనిస్తుందనుకోను, అని మరోసారి వ్రాసింది. పరీక్షా ఫలితాలు తెలిసి తనకు అభినందనలు పంపితే మారు జాబులేదు. కొన్నాళ్ళకో ఉత్తరం పిడుగులా వచ్చింది. ఆ ఉత్తరం ఇప్పటికీ నాకు కంఠోపాఠమే.

'ఇక నీవు నన్ను మర్చిపో! నా తండ్రికి ఎదురుతిరిగే స్తోమతకానీ, తరతరాల నుండీ నరాల్లో జీర్ణించుకుపోయిన సంప్రదాయాల్ని కాదనే ధైర్యం కానీ నాకున్నట్లుగా తోచడం లేదు. చదువుకునే రోజుల్లో ఉన్న స్వతంత్రం ఇంట్లో ఉన్న ఈ క్షణాన నాకు లేదు. మా నాన్న నాకో సంబంధం నిశ్చయం చేస్తున్నారు. మహాదుష్టుల్లా విధికి తలవంచి, ఆయన మలిచిన మార్గాన్నే నా జీవితం వెళ్ళదీసుకుంటాను. నన్ను క్షమించు!' అని వ్రాసింది. ఆ క్షణాన నాకు లోకంమీదా, స్వతంత్రంగా ప్రవర్తించడం ఇష్టంలేని స్త్రీ జాతిమీదా కసి, ద్వేషం ముంచుకొచ్చింది. చేతగాని ఆడవాళ్ళు చేతగానట్లు పడి ఉండక మధ్య మధ్య కొన్ని మెరుపులు చూపడం ఎందుకు? మగవాళ్ళ గుండెల్ని మండించి పిడికెడు బూడిదగా మార్చడం ఎందుకు? మొత్తం ఆడవాళ్ళంతా నాటకాలాడడానికి పనికి వస్తారు. ఇంత ప్రేమాయణం నడిపి ఇప్పుడు తండ్రి తెచ్చినవాణ్ణి కట్టుకుంటుందా? నన్నేం చేస్తుంది? అని విల విలలాడిపోయాను. ఈ గుండెల్లో ఆవిడమీద కుప్ప పోసుకున్న ప్రేమనంతా ఏం చెయ్యను? అని బాధ పడ్డాను. కొన్నాళ్ళు నీలాగే విధుర ప్రేమికుడి స్థితిలో ఉండేవాడిని. నీలా ఊళ్ళమీద పడలేదన్న మాటేగాని ఆ రోజుల్లో అనుభవించిన బాధను ఇప్పటికీ నేను మర్చిపోలేను. అందుకే నిన్ను చూడగానే పోల్చగలిగాను' నరహరి చెప్తున్నది వింటూ మధు ఆలోచించసాగాడు—మాధవి అంతే. తన్నెంత ఊరించింది! ఎంత దగా చేసింది? ఎంతో ఆశతో జీవితమంతా ఆవిడరాక కోసం సౌధం కట్టుకున్న తనను ఎంత నిరాశలో ముంచింది! నరహరి చెప్పిందే నిజం: అశక్తురాలైన ఈ స్త్రీలు జరిపే ప్రేమ వ్యవహారమంతా అసమర్థుడైన రచయిత ముగించే నాటకంలా అస్తవ్యస్తంగా ఉంటుంది. కాని ఆ ఫలితాన్ని తను అనుభవించడంలేదా? దానికి పరిష్కార మార్గం ఏమిటి?

'మధూ' అప్పుడే ఆలోచనల్లోకి జారిపోకు నా కథ చివరిదాకా విను! పరీక్ష ఫలితాలు తెలిశాక లెక్చరరుగా అనకాపల్లిలో ఉద్యోగం దొరికింది. అప్పటి విద్యార్థినుల్లో ఒకతె అపర్ణ. అతి సామాన్యంగా ఉండే ఆపిల్ల మొదట మొదట నన్ను ఆకర్షించనే లేదు. చదువులో కూడా పెద్దగ ప్రకాశించిన పిల్లేమీ కాదు. ఒక రోజు ఏదో తెలియని పాఠం చెప్పించుకోడానికి స్టాఫ్ రూమ్ దగ్గరికి వచ్చింది. కాసేపు చెప్పి పంపించేశాను.

'నరహరిగారూ! ఈ ఊరి పరిస్థితి మీకు కొత్త. ఆడపిల్లలతో అంత చనువుగా ఉండకండి.' అన్నాడు తోటి అధ్యాపకుడు కృష్ణమూర్తి.

'అందులో అటువంటి ఆడపిల్లలతో!' అని వంతపాడాడు మరో రామారావు.

నాకు మొదట అర్థం కాలేదు. నా అభిమానం దెబ్బతిన్నట్లయింది. అసలే ఈ లోక ప్రవృత్తి నుండి తాబేలులా లోపలికి ముడుచుకొని, ఏకాంతంగా నా మానసిక ప్రపంచంలోనే విరాగిగా బతుకుతున్న నాకు, వీళ్ళ మాటలవల్ల కొంచెం పౌరుషమే వచ్చిందనాలి.

'ఎటువంటి ఆడపిల్లేమిటండీ! అయినా మీరు తీసుకుంటున్న చనువేమిటో నాకే అర్థం కావడంలేదు. నో విద్యార్థిని పాఠం అర్థం కాలేదంటే చెప్పడమేనా చనువు!' గద్దించి అడిగాను.

'కోప్పడకండి! ఈ ఊరి సంగతి చెప్తున్నాను. అన్నా చెల్లెలూ ఏకాంతంగా మాట్లాడుతున్నా, గోడలమీద సాహిత్యాన్ని సృష్టించే కుర్రకారు మన విద్యార్థులు. అందులో ఇందాక వచ్చిన అమ్మాయి భోగంవాళ్ళ పిల్ల.' — కృష్ణమూర్తి అంటున్న మాటలకు నేను నిర్విణ్ణుడి నయ్యాను. అయినా తమ దగ్గర చదువుకునే పిల్లల కులాల దగ్గరనుంచి సకల సమాచారమూ తెలుసుకోవడం ఈ నాటి



ధ్యాపకుల నాగరకతా శాస్త్రంలో తొలి పాఠం కాబోలు!

'మరి ఆ పిల్ల తల్లి ఇంకా వృత్తిలోనే ఉన్నదాండీ ?' — కావాలనే పూర్తిగా పెంకెతనం ధ్వనించే గొంతుకతో అడిగిన నా ప్రశ్నకు కృష్ణమూర్తి కొంత సర్దుకున్నాడు 'లేదు. వాళ్ళంతా ఇప్పుడు వృత్తిమాని సంసారాలు చేసుకుంటున్నారు. ఈ పిల్ల తండ్రి వ్యాపారస్థుడు, తల్లి చాలా అందమైన మనిషని చెప్పు కుంటారు.'—

చాపకింద నీళ్ళలా ఉన్న వీళ్ళకెంత సమాచారం తెలుసు! విద్యార్థినికీ అధ్యాపకుడికీ ఉండే సంబంధాన్ని మించి వీళ్ళు స్త్రీ పురుష దృష్టితో ఎంతో విషయాన్ని సేకరించుకుంటున్నారు. అందుకు కారణం కేవలం ఆ పిల్లకులమే కదా! ఆ కులానికున్న అల్పమైన ప్రతిపత్తే కదా కృష్ణమూర్తి చేత ఆ పిల్ల తల్లి అందాన్ని కూడా ప్రసంగంలోకి తీసుకు రాగలిగింది! మరో ఉత్తమ కులస్థురాలి తల్లిని అలా మాటల్లో తీసుకురాగలడా!— భారతజాతి జీవితాన్ని ఇంతగా కలుషితం చేస్తూ మనిషికీ మనిషికీ మధ్య అడ్డుగోడల్ని కడుతున్న ఈ కుల వ్యవస్థ ఎప్పుడు పోతుంది! నా మనస్సంతా వికలమై పోయింది. కాని ఆ క్షణంనుంచీ నాలో ఏదో మొండితనం కూడా ప్రవేశించింది మధూ! ఏం జరుగుతుందో చూద్దాం అనే తెంపరితనంతోనే ప్రయత్నపూర్వకంగా అపర్ణను ఆకర్షించ సాగాను. నీకు తెలుసుకదా నాకు మొదటినుండీ మన సంప్రదాయం గౌరవించే వర్ణ వ్యవస్థ మీద కక్ష అని. స్వర్ణను ప్రేమించడంలోకూడా కొంత స్వార్థమూ ఉంది. అగ్రజాతికి చెందిన ఆడపిల్లను పెళ్ళి చేసుకుని ఈ వ్యవస్థను ధిక్కరించి యువతరానికి మార్గదర్శకుణ్ణవుదామనుకున్నాను. కాని స్వర్ణ నా అభిప్రాయాలతో కలిసి నడవకుండా నాకు అందని దూరాలకు వెళ్ళిపోయింది. ఒక స్త్రీ కలిసిరానంత మాత్రాన నా ఆదర్శాలేమయినట్లు ? నిండు నూరేళ్ళు జీవించవలసిన నా వ్యక్తిత్వానికి ఏ ప్రయోజనం మిగిలేటట్లు ? మనుషులు మోసం చేసినంత మాత్రాన ఆదర్శాలు మండిమస్సై పోకూడదనుకున్నాను. ఆ స్వర్ణ కాకపోతే యీ అపర్ణ! ఈ భోగం పిల్లనే పెళ్ళాడి నా మనస్సును సంతృప్తి పరచుకోవాలను కున్నాను. ఫలితమే మా పెళ్ళి. అపర్ణ గట్టిది. పెళ్ళికి ముందే నా అంతరంగాన్ని ఆవిడకు స్పష్టం చేశాను. నేనేదో ప్రేమతో ఈ వివాహానికి పూనుకోవడం లేదనీ, నాకో జీవిత సహచరి అవసరం కాబట్టి అపర్ణను ఎన్నుకుంటున్నాననీ చెప్పాను. అందులో కూడా స్వార్థం ఉందనీ గట్టిగా పాతుకు పోయిన మన వర్ణవ్యవస్థ పునాదిరాళ్ళను కదిలించే యత్నం మాత్రమే యీ వివాహంద్వారా చేస్తున్నాననీ చెప్పాను. అంతకు మించి మనస్సంబంధమైన ఎట్టి మృదులభావాలూ ఈ వివాహానికి కారణాలు కావని విస్పష్టంగా చెప్పాను. అప్పుడు నాకో భయం ఉండేది మధూ! స్వర్ణకే అర్పించిన ఈ మనస్సుతో అపర్ణకు అన్యాయం చేస్తానేమోనని! స్వర్ణను అసలు మర్చిపోలేక ఈ పిల్ల మనసులో నరకం సృష్టిస్తానని! ఇటువంటిదే అంతులేని భయం! అపర్ణ అన్నిటికీ తల ఊపింది. అపరిచితలా మెల్లగా హృదయమందిరంలో ప్రవేశించి సర్వాధికారాలూ కరగతం చేసుకున్నది. ఇప్పుడు ఒక్కక్షణం అపర్ణ లేకపోతే నాకు తోచదు మధూ! మరో విశేషం చెప్పనా? స్వర్ణ ఈ క్షణం నా ఎదురుగుండా ఉండడమే తటస్థిస్తే, పదినిముషాలు మాట్లాడి మనస్సుకు ఎటువంటి ముల్లూ గుచ్చుకోని స్థితిలో, అపరిచితలా అవతలికి పంపేయగలను! నాలో కలిగిన ఈ మార్పు గమనించడం నీకూ అవసరం!'—

మధు దీర్ఘంగా నిట్టూర్చాడు. నిండుగా ప్రవహించే నదిని ఈది గట్టు చేరాక ఈతగాడు ఏమైనా చెప్పవచ్చు, తానింకా నీళ్ళల్లోకే దిగలేదు. అవిరళంగా తీరాన్ని నురుగులు కక్కుతూ, మోదుతున్న నదీ తరంగాలకే అధికంగా భయపడి పారిపోయి వచ్చాడు. అయినా మాధవి స్వర్ణలాంటిది కాదు. నిజంగా మాధవి తన్ను నిరాకరించిందా! ఏదీ నిశ్చితంగా తేలకముందే తాను మరో వలయంలో చిక్కుకున్నాడు. ఇప్పుడు రాధను తానెలా కాదనగలడు? మాధవి నెలా మర్చిపోగలడు? నరహరి కోరే పరిష్కారం తన సమస్యకు రావడం ఎలా సాధ్యం?—

చెంపకు చెయ్యి తార్చి ఆలోచిస్తూ కూర్చున్న మధును అదని కర్మానికి వదిలేసి నరహరి ఇంట్లోకి వెళ్ళి పోయాడు—

(ఇంకా వుంది)



'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి; ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥







# వారఫలం

## 19-6-1970 శుక్రవారం మొదలు 25-6-1970 గురువారం వరకు

**మేషం** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**వృషభం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మిథునం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం** కొన్నివ్యవహారాల్లో మీ అంచనాలు తప్పిపోగలవు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. వారం మధ్యలో భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో ఆకస్మికంగా వ్యతిరేకత యేర్పడుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు. ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య** సామాన్యమైన పనులకు కూడా యెంతో కృషి చేయవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారంమధ్యలో వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— ప్రయాణాలోచనలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం** అన్ని వ్యవహారాల్లోను శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగాఉంటాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మకరం:** అధికవ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి రాగలదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**కుంభం.** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో మీ తాలూకువస్తువులు పోవచ్చును. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో తిరిగి అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో నమ్మినవారివల్ల ఇబ్బందులకు గురి కాగలరు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్




'పరుషంగా మాటలాడి పాలు తాగించ లేము గాని, మధురంగా మాటలాడి విషాన్ని కూడా తాగించ వచ్చును' అనే సామెత ఉన్నది. ఇది చాలామంది ఎరిగి ఉన్నదే! ఇదే అభిప్రాయం గల ఒక ద్విపదను చిన్నప్పుడు వీరేశలింగం పంతులు గారి వాచక పుస్తకంలో చదువుకున్నట్లు బాగా జ్ఞాపకం ఉన్నది— అది—

'గడుసు దనంబునఁ గాని
కార్యములఁ
గడు మెత్తబాటునఁ
గావింప వచ్చు'

ఇది నిజమే! మనస్సు మంచిది కాకపోయినా—దానితో నిమిత్తం లేదు. మాటలు చక్కగా వుంటే చాలు, పనిని సులభంగా సాధించుకో వచ్చును.

ఒక ఊళ్లో ఒక ముసలామె ఉండేది. ఆమెకు 'నా' అన్నవాళ్లు ఎవ్వరూ లేరు. ఒక ఆవును మాత్రం పెట్టుకుని అదే తన సర్వస్వంగానూ, ఆప్త బంధువుగానూ అభిమానంతో చూచుకునేది ఆ ఆవు ఒక దూడను కనినది, ముసలామె దాన్ని తన ప్రాణంతో సమంగా చూసుకునేది. అది చెంగు చెంగున గంతులు వేస్తూ ఉంటే ఎంతో మురిసి పోయేది. ఆ దూడ గంతులు వేస్తూ, అవ్వ పట్టుకోడానికి వెళ్లినా దొరక్కుండా దూరంగా పోయేది, ఆమె విసుగెత్తి ఒకచోట కూర్చోబడగా ఆప్యాయంగా దగ్గరకు మెల్లగా వచ్చి ఆ దూడ ఆమె ఒళ్లు నాకేది. దూడ తన్ను అలా అల్లరి పెట్టడం కూడా ఆమెకు వినోదంగానే ఉండేది.

ఒకనాడు అవ్వ దూడ కట్టువిప్పి, తాను ఇంట్లో ఏదో పని చేసుకుంటున్నాది. దూడ కొంతసేపు వీధిలో గంతులు వేసి, తిరిగి యింటిలోనికి వచ్చి అవ్వ వెనుకనే తిరగడం పరిపాటి. కాబట్టి, అలాగే జరుగుతుందని అవ్వ అనుకొన్నది. కాని ఆనాడు అలా జరగలేదు. దూడ వీధిలో గంతులు వేస్తుండగా, కొందరు కొంటెపిల్లకాయలు దాన్ని బెదిరించి తరిమారు అది వాళ్లనుండి తప్పించుకోడానికి చాలా దూరం పరుగెత్తవలసి వచ్చింది. అది ఊరు దాటి పక్కనున్న ఒక పంట పొలంలో ప్రవేశించింది. అందులోని చేలు కోతకు సిద్ధంగా ఉన్నందున— ఆ దూడను చూచి పొలం కాపులు ఆందోళన పడ్డారు. వాళ్లు నాలుగు వైపులనుంచీ బెదరగొట్టడంవల్ల ఎటు పోవడానికీ తోదక అది ఆ పొలం నాలుగు మూలలా తిరగ సాగింది. అందువల్ల చేలు పాడు కాసాగాయి.

అక్కడ ఇంటో అవ్వ కొంచెం సేపయ్యాక దూడకోసం చూస్తే అది కానరాలేదు. ఆమె యెంతో దిగులుపడి, వీధిలోకి వచ్చి కనబడిన వారినల్లా తన దూడను గురించి అడగ సాగింది, ఇలా అడుగుతూనే ఆమె ఊరి చివరకు వచ్చింది. అక్కడున్న ఒకరిద్దరు కొంతసేపటి కిందటనే ఒకదూడ ఆ పక్కనున్న పొలాలవైపు వెళ్లినట్లు చెప్పారు. అవ్వ ఆత్రంగా ఆ వైపు పోగా ఒక పొలంలో తిరుగుతున్న తన దూడను, నలువైపుల నుండీ బెదిరిస్తున్న కర్షకులూ కానవచ్చారు.

అవ్వ వేగంగా ఆ దగ్గరికి పోయి, వాళ్లనుచూసి 'అయ్యలూ! మీరు నాలుగు వైపులా చుట్టువేసి, బెదిరిస్తూ ఉన్నందున ఎటు పోవ

( 64వ పేజీ చూడండి )

'ఆడవాళ్ళు ఒకే ఒక రహస్యాన్ని దాచగలరు — అది వాళ్ళ వయస్సును—' అన్నాను అరుంధతితో కాఫీలదగ్గర.

ఈ మాటలు నేనెందు కంటున్నానో అరుంధతికి తెలుసు—

అంచేత—నేను 'రిటార్ట్' కోసం ఎదురు చూస్తున్నాను—కాని—అరుంధతి ఏం మాట్లాడలేదు ఆ మాటలు తనని గురించి కాదన్నట్టు కాఫీ త్రాగుతూ కిటికీ లోంచి చూస్తూ ఏదో ఆలోచిస్తోంది.

నిజానికి—అరుంధతితో నా పరిచయం ఇవాళ్టిది కాదు. అరుంధతితో నా జ్ఞాపకాలు త్రవ్వుకోవాలంటే చరిత్ర పాతికేళ్ళు వెనక్కి నడవాలి — ఈ పాతికేళ్ళలో దేశమూ, మనుషులం అందరం మారిపోయాం.

'చూడు కృష్ణమూర్తీ !— హైదరాబాద్‌లో ఇంకా ఎన్నాళ్ళు వుంటావన్నావు?—' హఠాత్తుగా అంది అరుంధతి ప్రసంగం మారుస్తూ.

'బహుశా రెండురోజుల్లో ఆఫీస్‌పని పూర్తయి పోవచ్చు ననుకుంటాను—కనీసం అప్పటిలోగా నయినా...' మధ్యలో ఆగిపోయాను.

'తప్పకుండా — పెళ్ళి ముహూర్తం కూడా ఎప్పుడో చేప్పేస్తాను—సరేనా! —' అంది నవ్వుతూ అరుంధతి

కాని—ఆ నవ్వు నన్ను మరింత సస్పెన్స్‌లోపెట్టి చంపింది.

* * *

అరుంధతి గురించి చెప్పాను గానీ — పాతికేళ్ళ క్రిందటి అరుంధతిగురించి చెప్పలేదు—అవి నేను మద్రాసులో చదువుకునే రోజులు.

అప్పట్లో అరుంధతి చాలా నాజూగ్గా వుండేది—

అందమైన ఆమె ముక్కు క్రింద నాజూగ్గా విరిసే నవ్వులో ఇప్పటికీ ఏమీ మార్పు రాలేదు గానీ—ఆ కళ్ళ వెలుగులో మాత్రం మార్పు వచ్చింది. అదీకూడా కొద్దిగానే—

ఇక—ఆనాటి పంజాబీడ్రెస్ స్థానంలో వచ్చిన చీర—రెండు జడలకు బదులుగా చోటుచేసుకున్న బర్మాముడి, ఆమె అందాన్ని తగ్గించాయా, హెచ్చుచేశాయా, అని అడిగితే నేను చెప్పలేను.

అరుంధతితోబాటు నేనుకూడా వయస్సులో ఎదగడం ఇందుకు ఒక కారణం అయినా కావచ్చు—

ఏది ఏమైనా — అప్పట్లో మటుకు ఎదురింటి రిటైర్డు తాసిల్దార్‌గారి అమ్మాయిపేరు అరుంధతి అని తెలుసుకున్న తర్వాత కొంచెం 'డిసప్పాయింట్' అయ్యాను. ఎందుకంటే — ఇంత అందమైన అమ్మాయికి అంతకన్నా మంచిపేరు వుండాలనిపించింది. అందుకని — ఏదో ముద్దుపేరుకూడా ఒకటి పెట్టుకున్నాను — అయితే ఇప్పుడది జ్ఞాపకంలేదు.

నిజానికి — అరుంధతితో నాకు పరిచయం కావడానికి నేను 'హీరోయిజమ్' ఏదీ చూపించాల్సిన అవసరం లేకపోయింది—

ఒకరోజున రిటైర్డు తాసిల్దార్‌గారు కనబడి 'ఏమయ్యా—నువ్వు భావగీతాలు రాస్తావట నిజమేనా ?—' అని నిలదీసి అడిగాడు రోడ్డుమీద—

కానిపని చేస్తున్నానని నడిరోడ్డుమీద నాలుగు అక్షింతలు వేస్తాడేమో అనుకున్నాను. (ఆ రోజుల్లో భావకవుల్ని విమర్శించడం ఓ సాంప్రదాయంగా వుండేది.) కాని—అలాంటిదేమీ చెయ్యలేదు. పైగా— 'నేను రిటైరైపోయి ముసలాణ్ణని ముద్ర వేసుకున్నానుగానీ నా భావాలన్నీ యువతరానివేనోయ్—' అంటూ భరోసా ఇచ్చాడు—కృష్ణ శాస్త్రిని పట్టుకుని ఆకాశంలోకి ఎత్తేశాడు—

నిజం చెప్పొద్దూ— ఆయన్ని చూస్తే ముచ్చటేసింది. ఇంత సాహిత్యపిపాస వున్న మనిషి రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో ఎంత అవస్థపడి పోయాడో కదా పాపం అనిపించింది.

కాసేపు—రోడ్డు ప్రక్కన సాహిత్యచర్చ జరిగిన తర్వాత— 'ఓ ఆదివారం వీలు చూసుకుని మాయింటికి తీరుబడిగా రా—' అని ఆహ్వానించడంతో మామూలుగా కథల్లో రాసేట్టుగానే నేను రంగంలోనికి ప్రవేశించాను—

అరుంధతిది చాలా విచిత్రమైన మనస్తత్వం. ఏ విషయాన్నయినా ఆమె ఎంత సీరియస్‌గా తీసుకోగలదో అంత 'లైట్'గా కూడా తీసుకోగలదు—ఓ విషయంమీద కాసేపు ఆవేశంగా మాట్లాడి ఆ తర్వాత దానిమీదే 'జోక్' వేసి అందరితో బాటు తనూ నవ్వేది—మొదటిలో ఈ ప్రవర్తన చిత్రంగా కనబడినా—ఆ తర్వాత అలవాటయి పోయింది.

అందుచేతనే — ఆమె భావకవుల్ని తిట్టినా — ఆ తర్వాత ఎంకిపాటల్ని పాడినా — పెద్ద తేడా గమనించలేని స్థితికి వచ్చాను.

ఏది ఏమయినా— అరుంధతిది కమ్మటి గాత్రం.

అప్పట్లో ఆమె పాడిన జయదేవుడి అష్టపదుల్నీ, క్షేత్రయ్య పదాల్నీ నేనే నాటికి మరచిపోలేను—

మొత్తానికి—అరుంధతికి చాలా ఆదర్శాలు, అభిప్రాయాలూ వున్నాయి. అయితే—వయస్సు చిన్నదికావడం వల్లనో మేధ పరిపక్వతకు రానందునో ఏదీ స్థిరంకాకుండా విచిత్రంగా వుండిపోయాయి.

బహుశా ఇందువల్లనే కాబోలు రిటైర్డు తాసిల్దార్ రామేశంగారు ఒకటి రెండుసార్లు నాతో అన్నారు-'ఈఅమ్మాయి నాకోసమస్య కృష్ణమూర్తీ!— కాలానికి పది అడుగులముందు నడిచేవాళ్ళను లోకం ఎప్పుడూ వేలెత్తి చూపిస్తుంది—కాని, అందులోనిబాధ అరుంధతికి తెలియదు—' రామేశంగారి ఆవేదన అప్పట్లో నాకు అర్థం కాలేదు. ఆమాటలు అర్థం కావడానికి నాకు మరో పదిహేను రోజులు పట్టింది—అరుంధతి ఇంటికి వెడుతున్నానని తెలియగానే కాలేజిలో మాక్లాస్‌మెట్సంతా—'ఎన్నో నెంబరు గురూనీది—' అంటూ వేళాకోళం చెయ్యడం ప్రారంభించారు. మొదటిలో వాళ్ళమాటలను నేను అసూయగా కొట్టిపారేశాముగానీ ఆ తర్వాత పరిస్థితి అర్థమైంది.

రామేశం గారింటికి ఎప్పుడూ ఏవో మొగపురుగులు వస్తూనే వుండేవి—వాళ్ళందరూ రామేశంగారికోసం వస్తున్నారనుకునే వాడిని మొదటిలో—కాని ఆ తర్వాత అసలు విషయం తెలిసింది—

శర్మ, సీతాపతి, మాధవమూర్తి, కాంతారావు, వీళ్ళందరూ నాకు అరుంధతి 'బోయ్‌ఫ్రెండ్స్—' గా పరిచయం అయ్యారు. శర్మ ఎం. బి. బి. యస్. రెండో సంవత్సరం చదువుతున్నాడు—

మాధవమూర్తి ఫస్ట్ ఆనర్స్‌లో వున్నాడు. సీతాపతి రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా పని చేస్తున్నాడు—కాంతారావు—ఇంటర్ మీడియేట్ ఫెయిలయి ఆ తర్వాత వేషాల కోసమని స్టూడియోల చుట్టూ తిరుగుతున్నాడు.

వీళ్ళందరూ నాకన్నా వయస్సులో పెద్దవాళ్ళు—అందుచేత నేను కొంచెం 'రిజర్వ్‌డ్'గానే వుండేవాణ్ణి—

వాళ్ళల్లో మాధవమూర్తి మాత్రం కొంచెం సన్నిహితంగా వుండేవాడు. మనసు విప్పి మాట్లాడ్డానికి తను ప్రయత్నించి నాకు అవకాశమిచ్చేవాడు — అరుంధతిని పెళ్ళి చేసుకోవాలని కోరికగా వున్నట్టు మాధవమూర్తి వోసారి నాతో అన్నాడు. అంతేకాదు—శర్మ, సీతాపతి, కాంతారావు కూడా అరుంధతి మీద అలాంటి అభిప్రాయంలోనే వున్నారని అయితే అరుంధతి [illegible] తనని తప్ప మరెవరినీ పెళ్ళి చేసుకోదని చెప్పాడు—ఈమాటలు అతగాడు నాతో ఎందుకు చెప్పాల్సి వచ్చిందో నాకు అర్థం కాలేదు. 'నువ్వు ఏమన్నా వెర్రి వేషాలు వేద్దామనుకుంటున్నావేమో జాగ్రత్త' అని చెప్పడానికి మొహమాటపడి మాధవమూర్తి సున్నితంగా ఇలా చెప్పాడనుకున్నాను. ఏది ఏమయినా—అరుంధతిమీద ఎలాంటి అభిప్రాయం ఏర్పరుచుకోడానికి అవకాశం లేదప్పటికి. 'అలాంటి భయం ఏమీ లేదులే' అని

# సప్తపది

చెప్పబోయి తమాయించుకున్నాను.

ఇది జరిగిన తర్వాత—వారం రోజులకు కాబోలు బీచిలో అరుంధతి మాధవమూర్తితో కనబడింది. ఆ తర్వాత ఇలాంటి సంఘటనలు అనేకం నేను చూడటం కాని—వినడంకాని—జరిగాయి.

వీటిని దృష్టిలో వుంచుకునే కాబోలు వోసారి నాతో అంది అరుంధతి—'చూడు కృష్ణమూర్తీ!—నేను మాధవమూర్తిని పెళ్ళి చేసుకుంటే తప్పా'—అతని కులం, గోత్రం ఏ మయితే పై వాళ్ళకెందుకు? శర్మ, సీతాపతి, దీన్ని పెద్ద రాద్ధాంతం చెయ్యాలని ఎందుకు చూస్తున్నారో నా కర్థం కావడంలేదు. ఇది నా వ్యక్తిగత విషయం—'

ఇది విన్నవెంటనే నాకు ముందు కలిగిన భావం మాధవమూర్తి మీద 'జలసీ'యే అయినప్పటికీ—దాన్ని తమాయించుకుని అతగాడిని మనస్ఫూర్తిగా అభినందించగల కనీస సంస్కారం నాలోంచి అప్పటికి ఇంకా పోలేదు.

ఇంతలో ఇంటర్మీడియేట్ పరీక్షలు ముంచుకు రావడంలో—ఇక — అరుంధతీ ప్రేమాయణానికి 'గుడ్‌బై' చెప్పి చదువులో మునిగిపోవాల్సి వచ్చింది.

'సెలవులకి మా యింటికి వెళ్ళిపోతూ పెళ్ళికి ఇన్విటేషను పంపకపోతే వూరుకోను—' అన్నాను అరుంధతితో.

'బావుంది—ముహూర్తం పెట్టగానే వెంటనే ఎక్స్‌ప్రెస్ డెలివరీలో నీకు ఉత్తరం రాయనూ—' అంది అరుంధతి.

* * *

—ఆ తర్వాత మా నాన్నగారికి చిత్తూరునించి విశాఖపట్టణం ట్రాన్స్‌ఫర్ అయిపోవడంతో మద్రాసుతో సంబంధం తెగిపోయింది — నా చదువు మద్రాసునించి విశాఖకు మకాం మార్చింది. ఈ మధ్యకాలంలో అరుంధతినించి వెడ్డింగు కార్డుగానీ, ఉత్తరంగానీ రాలేదు. దాదాపుగా అరుంధతిని మరచి పోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.

కాలగమనంలో పది సంవత్సరాలు దొర్లిపోయాయి.

ఈలోగా మన దేశానికి స్వతంత్రం రావడం—స్వతంత్ర జీవితంలో నేను పాతుకు పోవడం అన్నీ జరిగిపోయాయి.

అనుకోకుండా రాజమండ్రీ రైల్వే స్టేషన్‌లో అరుంధతి కనబడింది. బాగా చలిగా వుందేమో మఫ్లర్ చుట్టుకుంది. 'ఏమండోయ్!—కృష్ణమూర్తిగారూ!—ఏం గుర్తున్నామా?—' అంటూ నవ్వుతూ పలకరించింది.

ఎలా మరచిపోతాను అరుంధతిని?—

'నువ్వు ఈ వూళ్ళో వుంటున్నావా?' అన్నాను ఆశ్చర్యంగా—

'లేదు — బంధువులింట్లో పెళ్ళి వుంటే వచ్చాను—అయితే నువ్వు ఇక్కడ వుద్యోగం వెలిగిస్తున్నావన్నమాట!!—' అంది.

'అవును — ఇంజనీర్‌గా పనిచేస్తున్నాను—' అంటూ నాకథ చెప్పుకున్నాను.

ఇద్దరమూ ఒకే కంపార్ట్‌మెంటులో కూర్చున్నాము. బండి కదులుతూండగా అన్నాను—'మాధవమూర్తిగారు రాలేదా?'

దానికి అరుంధతి నొసలు చిట్లించి—'ఏ మాధవమూర్తి?—' అంది.

ఆ మాటలకు నేను తెల్లబోయాను. 'అదేమిటి? — నువ్వు మాధవమూర్తిగారిని పెళ్ళిచేసుకోలేదా?' అన్నాను ఆశ్చర్యంగా.

'ఓహ!—ఆ ప్రైవేట్ సంగతి నాకు



చెప్పకు. నా దగ్గర అన్ని గొప్పలు చెప్పి ఆ తర్వాత అమ్మా, నాన్నా, పద్మన్నా రని మొహం చాటేశాడు — ఒట్టి పిరికి!—' అంది.

అప్పుడు అర్థమైంది నాకు—అరుంధతినించి ఎందుకు శుభలేఖ రాలేదో.

'అయితే—నువ్వు పెళ్ళి చేసుకో లేదన్న మాట!—' అన్నాను.

'బాగుంది నీ సందేహం. మా ధన మూర్తి తప్పించి ప్రపంచంలో మొగవాళ్ళే లేరా — విక్షేపంలా పెళ్ళి చేసుకున్నాను—'

'ఎవర్ని?—' కుతూహలాన్ని చంపుకోలేక పోయాను. 'ఎవరినయితే నేం—పెద్ద పెద్ద డిగ్రీలున్న ఒక మహానుభావుణ్ణి పెళ్ళాడాను. అతగాడు ముందు మాకు బంధువుగా పరిచయమయ్యాడు. ముందున్న నాన్న ముచ్చటపడితే పెళ్ళి చేసుకున్నాను—'

'బావుంది—అయితే సాంప్రదాయమైన పెళ్ళి చేసుకున్నావన్నమాట!—'

'—అందుకే దెబ్బతిన్నాను తను వచ్చిపోతూ, వచ్చిపోతూ, మానాన్న నా జీవితంమీద పెద్దదెబ్బ కొట్టిపోయాడు. చదువుకున్నవాడుకదా అనుకున్నాను. కాని—ఇంత సంకుచిత మనస్తత్వంగల మనిషని తెలుసుకోలేక పోయాను. అమెరికా వెళ్ళివచ్చిన ఆ పెద్దమనిషి దృష్టిలో ఆడది వంటింటి కుందేలు. గడపదాటి బయటకు రావడానికి వీల్లేదు. రెండేళ్ళు ఓపికపట్టి ఇక నావల్లకాక తెగతెంపులు చేసుకుని వచ్చేశాను—'

'విడాకులు ఇచ్చేశావా?—' అన్నాను తెల్లబోతూ.

'ఏం అంత ఆశ్చర్యపోతున్నావు?—భారత స్త్రీ విడాకులు ఇవ్వకూడదా?—' అంది రోషంగా.

అరుంధతి మాటలకు కొంచెం తడబడి—'అబ్బెబ్బే — అలాంటిదేమీ లేదు. ఊరికే అన్నాను. అయితే ఇప్పుడు...'

'బెజవాడలో వుంటున్నాను. దేముడి దయవల్ల ఆలిండియా రేడియోలో వుద్యోగం దొరికింది. నాకు ఏం లోటు లేకుండా జరిగిపోతోంది...'

అరుంధతి మాటలకు సంతోషించలేక పోయాను. ఆమె మీద జాలికూడా వేసింది. 'అయితే నీ జీవితం ఇంకా స్థిరపడలేదన్న మాట...' అన్నాను బాధగా.

'ఏం చెయ్యమంటావు చెప్పు?— నీలాంటి నోరులేని జంతువుకోసం వెదుకుతున్నాను. నీకు పెళ్ళికాకుంటే చెప్పు మరి...' అంది నవ్వుతూ—

అదిరిపోయాను.

'అబ్బెబ్బే—నాకు ఇద్దరు పిల్లలు—' అన్నాను. నా ఖంగారుచూచి విరగబడి నవ్వింది అరుంధతి.

అరుంధతి నవ్వుతూవుంటే చూస్తూ వుండిపోయాను. కాలగమనంలో పదేళ్ళు మాత్రమే గడిచిపోయినా నాలో ఎంతో పెద్దరికం వచ్చింది. కుర్రతనం పూర్తిగా పోయింది. కాని — అరుంధతి ఇంకా పూర్వంలాగానే వుంది — ఇంకా చెప్పాలంటే అప్పటికన్నా అందంగా ఆకర్షణీయంగా వుంది — ఇంత అందమైన అమ్మాయికి విడాకులు ఇచ్చిన ఆ 'అమెరికా రిటర్న్‌డ్' మీద చాలా కోపం వచ్చింది.

ఏలూరు స్టేషనులో దిగిపోయాను. నవ్వుతూ చెయ్యి వూపింది అరుంధతి —

బండి కదిలిపోతూంటే అరుంధతికి నా ఎడ్రస్ ఇచ్చి ఉత్తరం రాయుమని చెబుదామనుకున్నాను. కాని—ఆ కోరిక అలాగే ఉండిపోయింది.

* * *

చూస్తుండగానే పన్నెండేళ్ళు జరిగిపోయాయి. అప్పటికి నేను ఒక ప్రయివేట్ కంపెనీకి టెక్నికల్ ఎడ్వయిజర్‌గా వున్నాను.

ఉద్యోగంలో హోదాలో ఎదిగాను.

వయస్సు పెరిగింది.

తల్లో తెల్లవెంట్రుకలు చోటు చేసుకున్నాయి. కళ్ళకు పెద్ద కళ్ళజోడు వచ్చేసింది.

ముసలివాణ్ణి అయ్యానని ఎవరన్నా అంటే ఒప్పుకోనుగానీ—బాగా పెద్దతరహా వచ్చేసింది.

ఈ పరిస్థితుల్లో హైదరాబాద్‌కి కంపెనీపనిమీద వచ్చి సాయంత్రంపూట మా ఆఖరి 'ఎడిషన్'కి సూపర్ బజార్‌లో బొమ్మలు కొంటూవుండగా — 'ఎవరికి బొమ్మలు? — పిల్లలకా? — మనవలకా?—' అనే గొంతు వినబడింది.

వెనుతిరిగి చూచేసరికి 'షాక్' తిన్నాను. నవ్వుతూ కనబడింది అరుంధతి! — జన్మలో మళ్ళీ అరుంధతిని చూస్తాననుకోలేదు. చూచినా — చాలా బాగా పెద్దరికం వచ్చి వుంటుందనుకున్నాను. కాని—అరుంధతిలో పెద్ద మార్పేమీ లేదు.

కాస్త పెరిగిన శరీరాన్ని — కళ్ళ



క్రింద ఏర్పడిన గీతల్ని — మినహాయిస్తే, అరుంధతిలో చెప్పుకోదగ్గ మార్పు ఏమీ లేదు. ఇప్పటికీ ఆమెలో ఆకర్షణ వుంది — క్లియోపాత్రా జ్ఞాపకం వచ్చింది — 'ఏజ్ కెనాట్ విదర్ హెర్ నార్ కస్టమ్స్ స్టేల్ హెర్ ఇన్‌ఫినిట్ వెరైటీ!'

'ఏమిటలా చూస్తున్నావు? — మతి మరుపుగాని వచ్చిందా?' — అంది.

'బొత్తిగా ఈ వయస్సుకే అలా అయిపోయావేమిటి? — ఆ జుట్టుకు కాస్త రంగు వేసుకోకూడదూ —' అని సరస మాడింది.

అచేతనంగా వింటూ వుండిపోయాను.

అరుంధతికి హైదరాబాద్ స్టేషన్‌కి ట్రాన్స్‌ఫర్ అయిందట — తన ఇంటికి తీసుకు వెళ్ళింది — వాళ్ళ ఇంట్లోనే భోంచేసి ఆ రాత్రికి అక్కడే వుండిపొమ్మంది. అరుంధతి ఆహ్వానాన్ని నేను ఒప్పుకోకుండా వుందామన్న మనస్సు తిరగబడింది, నా కాళ్ళూ చేతులూ కట్టేసి నోరు మూసుకుని అరుంధతి చెప్పినట్టు విను —' అని మనస్సు ఉపాయించింది. ఇక — చేసేదిలేక ఆపూట వాళ్ళింట్లోనే భోంచేసి రాత్రికి అక్కడే పడుకున్నాను.

# సప్తపది

అరుంధతి అస్తమానూ మాట్లాడుతూనే వుంది.

మనుషులందరూ దుర్మార్గులట —

ఒక్కడికి 'మొరాలిటీ' లేదుట —

అందులో మొగవాళ్ళను అసలు నమ్మకూడదట —

ఆడవాళ్ళను ఎలా గౌరవించాలో మొగాడికి ససే తెలియదుట — వింటూ వుండిపోయాను నేను —

మాటల మధ్యలో అంది అరుంధతి — 'త్వరలో నేను పెళ్ళిచేసుకోబోతున్నాను —' అని.

'మళ్ళీ పెళ్ళా? —' అనబోయి అరుంధతికి భయపడి నాలిక్కరుచుకున్నాను. 'ఏమిటీ? —' అని మాత్రం అనగలిగాను.

'అవును — అయితే వివరాలేవీ అడగొద్దు — ప్రస్తుతానికి ఇంతే — మిగతా విషయాలన్నీ వెండితెరమీద చూసి తెలుసుకోవాల్సిందే —' నవ్వుతోంది అరుంధతి.

* * *

ఆ రాత్రి ఎందుకో నాకు నిద్ర పట్టలేదు.

అరుంధతి ఇంట్లో పడుకోవడమే అందుకు కారణం అనుకుంటాను.

సిగరెట్ ముట్టించి కాసేపు అరుంధతి కాబోయే భర్తగురించి ఆలోచించాను —

ఆలోచించిన కొద్దీ అరుంధతి అబద్ధం చెబుతోందనిపించింది. లేకపోతే ఈ వయస్సులో అరుంధతికి పెళ్ళేమిటి? — నన్ను ఆడిద్దామని కాకపోతే —

ఈ ఆలోచన ఎందుకో నాకు సంతృప్తి నిచ్చింది.

సిగరెట్ పారేసి మంచంమీద పడుకున్నాను — మనస్సెందుకో కోపెలా వుంది — గుండెల్లో ఏదో గందరగోళంగా వుంది —

కళ్ళముందు అరుంధతి అందమైన ముఖం కనబడుతోంది —

కళ్ళు చింతనిప్పులైపోతున్నాయి.

పాతికేళ్ళుగా నిగ్రహించుకున్న కోరిక వెన్ను తడుతోంది —

'ఛ! — నేను బ్రూట్‌ని కాను —' నాలో నేను గొణుక్కున్నాను.

గదిలోవున్న టేబిల్ గడియారం పన్నెండుగంటలు చూపిస్తోంది.

ఇంకో సిగరెట్ తీశాను. కాని — కాల్చబుద్ధి వేయలేదు — రెండుసార్లు పీల్చి అవతలకు పారేశాను — శర్మ, సీతాపతి, కాంతారావు, మాధవమూర్తి, జ్ఞాపకం వచ్చారు. వాళ్ళందరికన్నా తీసిపోయానా నేను? —

మెల్లిగా తలుపు తీసి బయటకు నడిచాను. ఎదురుగా వుంది అరుంధతి గది. గది తలుపుకూడా వేసిలేదు. లోపల ఫేన్ తిరుగుతున్న చప్పుడు మాత్రం వినబడుతోంది. గుండెల్ని దిటవు చేసుకుని ముందుకు నడుస్తున్నాను —

ఇంతలో అరుంధతి గదిలో లైట్ వెలిగింది — గదిలోంచి బయటకు వస్తూ నన్నుచూచి నవ్వుతూ అంది అరుంధతి.

'ఏం — కృష్ణమూర్తీ! — నిద్రపోలేదా నువ్వు? — లేక నిద్రలో వేట ఏదైనా చేస్తున్నావా? —'

ఆ పలకరింపుకు నాతల తిరిగిపోయింది. ఏదో కానిపని చేస్తూ 'రెడ్‌హేండెడ్'గా దొరికిపోయి నట్టయింది —

'అబ్బెబ్బే — అదేంలేదు —' అన్నాను —



వుంది—తెలుసనుకుంటాను—'

'తెలుసు—ఆవిడను మీరు మీట్ య్యారా?—'

మాట్లాడలేదు నేను—

'మీకు తెలుసో తెలియదో అరుంధతి మరో క్రొత్త ప్రేమాయణం ప్రారంభించింది—'—అన్నాడు శర్మ.

'ప్రేమాయణమా?—' అన్నాను అర్థం కాక—

'అవును—యూనివర్సిటీలో డాక్టర్ వరప్రసాదరావని ఒక పొలిటిక్స్ ప్రొఫెసరున్నాడు — అతగాడు ఇప్పుడు మీ అరుంధతికి తాజా ప్రియుడు—అతగాడిని అరుంధతి పెళ్లి చేసుకుంటుందని కూడా విన్నాను—'

'పొలిటిక్స్ ప్రొఫెసర్ వరప్రసాదరావా?—'అన్నాను ఆశ్చర్యపోతూ—

'అవును అతగాడు మీకు తెలుసా?—'

'తెలియక పోవడమేమిటి?—వైజాగులో చదువుకునే రోజుల్లో అతనూ నేనూ బాగా స్నేహితులం—మా యింటి ప్రక్కనే వుండేవాడు—అయినా అతనికి ఇదివరకే పెళ్లి అయిందని విన్నాను, ఇప్పుడు మళ్లీ పెళ్లి ఎందుకు చేసుకోవలసి వచ్చిందో నాకు అర్థం కావడం లేదు—'

ప్రొఫెసర్‌ని నేను ఎరుగుదు నన్న విషయం తెలియగానే శర్మ ముఖంలో వెలుగు కనబడింది—'అయితే వెంటనే వెళ్లి అతగాడితో చెప్పండి. అరుంధతి లాంటి క్లియోపాత్రాను పెళ్లి చేసుకుని సుఖపడలేడని—'

అరుంధతి మీద శర్మకు ఇంకా ఎందుకు ఇంత కక్షో నాకు అర్థం కాలేదు. అతడి మాటల్లో నాకు సంస్కారం కనబడలేదు.

# సప్తపది

'ఇది అన్యాయం—' అన్నాను కోపంగా.

'ఏం చెప్పు—కాని, మీ మిత్రుడయిన అవతలి వ్యక్తి గురించి కూడా మీరు ఆలోచించాలి—' అన్నాడు శర్మ—

శర్మ కసితో అంటున్నాడు — శర్మలా నాకు అరుంధతి మీద కసి లేదు. ప్రసాదరావు దగ్గర అరుంధతి గురించి చెప్పాల్సిన అవసరం నాకు లేదు.

అయినా — ఎందుకో నాకు ప్రసాదరావును చూడాలనిపిస్తోంది. ఇన్నాళ్లుగా హైదరాబాద్ వస్తున్నా ఎప్పుడూ నాకు అతడిని కలవాలనిపించలేదు. కాని— ఇప్పటి పరిస్థితి వేరు. ఏదో తెలియని శక్తి నన్ను ప్రసాదరావు ఇంటివేపు తోస్తోంది.

టాక్సీని యూనివర్సిటీ స్టాఫ్ క్వార్టర్స్ వైపు పోనిమ్మన్నాను. డాక్టర్ ప్రసాదరావు ఇల్లు చాలా నిరాడంబరంగా వున్నా, 'నీట్'గా వుంది—డ్రాయింగ్ రూమ్‌లో వున్న సోఫాలో కూర్చున్నాను.

వరప్రసాదరావును చూసి దాదాపు ఇరవై ఏళ్లు అవుతుంది. ఇప్పుడు పని గట్టుకు మాట్లాడడం— మాట్లాడాలని బయలుదేరడం—నాకే చిత్రంగా వుంది— నా మనసుకు ఇష్టంలేని పనులు ఈ మధ్య చాలా చేస్తున్నా ననిపించింది.

నేను కూర్చున్న మరో రెండు నిముషాలకు ఓ అందమైన యువతి హాల్లోకి వచ్చి ఫేన్ 'ఆన్' చేసి 'డేడీ స్నానం చేస్తున్నారు— కూర్చోండి—' అంది.

ప్రసాదరావుకు ఇంత పెద్ద కూతురుందన్న మాట! — అయినా పెళ్లికి ఆయారవుతున్నాడు!—ఛి—ఛీ—ఏం మనిషి? —అనిపించింది—ప్రసాదరావు కూతురును చూడటం అదే ప్రథమము అయినా ముఖం ఎందుకో సుపరిచితమైన దానిలాగే వుంది— అయితే ఎప్పుడు ఎక్కడ చూచానో మాత్రం గుర్తు పట్టలేకపోయాను. మరో మూడు నిముషాల్లో ప్రసాదరావు రానే వచ్చాడు— వో నిముషం తటపటాయించిన తర్వాత నన్ను గుర్తు పట్టాడు—

'కృష్ణమూర్తీ!—నువ్వు చాలా మారిపోయావు— ఏమిటి ఇంత లావైపోయావు —నిన్ను చూస్తుంటే నాకూ అనుమానం వేస్తోంది—నేను కూడా మారిపోయానేమో నని—' అన్నాడు ప్రసాదరావు తన బట్ట తలను నిమురుకుంటూ—

'చిననాటి రోజులు తలుచుకుంటే చాలా చిత్రంగా వుంటుంది—మనం వార్ధక్యం లోకి ఎంత త్వరగా ప్రవేశిస్తున్నాం అని పిస్తూ వుంటుంది—' అన్నాడు ప్రసాదరావు.

'అయినప్పుడు ఇప్పుడీ పెళ్లి ఎందుకు?' —అని అడగాలనిపించింది—కాని, నానోటి నుంచి ఈ ప్రశ్న వచ్చేలోపుగానే గుమ్మం దగ్గర అడుగుల చప్పుడు వినబడింది.

'హాహా!— కృష్ణమూర్తి కూడా ఇక్కడే వున్నాడే!—' అంటూ లోపలికి వచ్చింది అరుంధతి.

అరుంధతిని చూడగానే నా గొంతులో పచ్చి వెలక్కాయ పడింది. నా తడబాటును అణచుకుంటూ—'అవునవును — ప్రసాదరావు నా బాల్యస్నేహితుడు—' అన్నాను.

అది విని నవ్వుతూ అంది అరుంధతి— 'నీకు అంతే తెలుసు—మరి కొంచెం చెబుతాను విను—ఈయన నా భర్త—'

'దీని గొప్ప తగలెయ్య—అప్పుడే పెళ్లి అయినట్లు సంబర పడుతుంది' అనుకున్నాను.

ఇంతలో లోపలినించి ఇందాకటి అమ్మాయి పరిగెట్టుకు వచ్చింది. 'హలో —మమ్మీ—' అంటూ—

సమయం చిక్కింది నాకు—

'వోహో!—నీ కాబోయే కూతురన్న మాట!—' అన్నాను కసిగా 'జోక్' వేస్తూ—

దానికి గంభీరంగా నవ్వింది అరుంధతి —'నా కాబోయే కూతురు—కన్నకూతురు!'

అర్థం కాలేదు నాకు—






'—ఇక ఇప్పుడైనా అసలు సంగతి నీకు చెప్పక తప్పదు కృష్ణమూర్తీ!—ప్రసాదరావుగారు ఇదివరలో నన్ను అగ్ని సాక్షిగా పెళ్ళాడిన భర్త. మా రెండేళ్ళ దాంపత్య జీవితంలో లభించిన వరం ఈ 'సుచరిత' — ఆలిండియా రేడియోలో పాటలు పాడటానికి వచ్చి నాకు ఈ సుచరిత పరిచయం అయింది. ఆ తర్వాత అసలు విషయం తెలిసింది. ప్రొఫెసర్ గారిని కలుసుకున్నాను. నాటినుంచి పెళ్లి చేసుకోకుండా వుండిపోయిన ప్రొఫెసర్ గారిని చూస్తే నా హృదయం ద్రవించి పోయింది—నా పొరబాటు తెలుసుకున్నాను. ప్రొఫెసర్‌గారు తన అభిప్రాయాల పంజరంలోంచి నాలుగడుగులు ముందుకు వచ్చారు జీవితంలో నేర్చుకున్న పాఠాలు నా అభిప్రాయాలనించి నన్ను మూడడుగులు వెనక్కి నడిపించాయి — విచిత్రమైన రీతిలో సప్తపది పూర్తయింది—మా ఇద్దరి అభిప్రాయాలూ ఇప్పుడు ఏకీభవించాయి. నిజానికి — ఈ కాస్మొపొలిటన్ ప్రపంచంలోని మొగాళ్లను చూస్తే నాకు రోత కలిగింది—నాగరికతను అవకాశంగా తీసుకుందామని చూచే తోడేళ్ళలాటి ఈ మొగజాతంటే నాకు అసహ్యం వేసింది— కొన్నాళ్ళు పోతే—కౌగితం పువ్వులాంటి ఈ నాగరికతకు 'గుడ్‌బై' కొట్టి పూర్తిగా ఆర్థడాక్స్‌గా మారిపోతానేమో కూడా చెప్పలేను— ఏది ఏమయినా—ఇప్పుడు నేను ఆయన్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను—వచ్చే నెలలోనే పెళ్లి చేసుకోబోతున్నాను — మా పెళ్లితోబాటే మా సుచరిత తను కోరుకున్న వరుడితో జరగబోతోంది—మా తల్లీ కూతుళ్ల పెళ్లిళ్లు ఒక్కసారే జరుగుతున్నాయి—నువ్వు వచ్చి ఆశీర్వదించాలి.'

అరుంధతి మాటలకు ప్రసాదరావుగారు నవ్వుతున్నారు.

నాకు తల తిరిగిపోతోంది—

ఏం మాట్లాడాలో తెలియడం లేదు—

అనవసరంగా భుజాలు తడుముకోవడం నాకిష్టంలేదు—

ముఖం మీద నవ్వు పులుముకోపోతే బావుండదు మరి—

డామిట్!—కథ అడ్డం తిరిగింది!!—



'మధు ... మీరు సర్జరి యూనిట్‌లో వాలంటీర్‌గా పనిచెయ్యాలి' అన్నారు అసిస్టెంటు డాక్టర్ శ్రీనివాస్.

నేను మాట్లాడలేదు. వాలంటీర్ అంటే యిన్‌వాలంటరీగా పనిచేయాలని నాకు తెలుసు. అందులో యిది వైద్య కళాశాలా ప్రదర్శనం. చాలామంది జనం రావచ్చు. వాళ్లందరికీ తీరుబడిగా వివరిస్తూ కూర్చుంటే మనపని ఖాళీ అయిపోతుంది. అందులోనూ మల్లి, రాజా అందరం కలిసి ఈ ఎగ్జిబిషన్‌శలవల్లో ఎలాగయినా సరే ఆరకు వెళ్లాలని నిర్ణయించుకున్నాం. ఇప్పుడు ఈయన యిలా ప్రశ్నించటంతో ఏం జవాబు చెప్పాలో అర్థం కాలేదు.

'ఏం ? మీరు యింకేదయినా డిపార్ట్‌మెంటులో పనిచేస్తున్నారా ?'

'నో సార్'

'దెన్...మీరు యిక్కడ పనిచేయ వచ్చుముగా' అన్నారు.

'అలాగే సార్' అన్నాను. కాదంటే బాగుండ దనిపించింది.

'అయితే మీరు...మిస్ సంధ్య, కల్పన, రావు, రాము సర్జరీ వాలంటీర్స్‌గా పనిచెయ్యాలి...రేపు వుదయం తొమ్మిదింటికి సి. జి. లెక్చరర్‌గారి దగ్గర కలుసుకుందాం ... అప్పుడే వర్క్ డిస్ట్రిబ్యూట్ చేస్తాము' అన్నారు. 'సరే' అనక తప్పలేదు.

'మధు ... మీరుకూడ వుంటే మాకు కాస్త వూసిపోతుంది' అంది సంధ్య ప్రక్కకు వచ్చి. ఆమె వార్డ్ మేట్. క్లినిక్స్‌కివచ్చి రెండునెలలుకూడ కాలేదు కాని ఆవిడతో పరిచయంమాత్రం చాలా పెరిగిపోయింది. ఆమె అదోక రకమైన మంచి మనిషి. అందరితోనూ అంత చనువుగానే వుంటుంది.

మర్నాడు వుదయం తాపీగా తొమ్మిదిన్నరికి వార్డ్ చేరుకున్నాను. రాజా కనుపించాడు. 'గుడ్ మార్నింగ్ డాక్టర్' అన్నాను.

'హాయ్ గుడ్‌మోర్నింగ్ డాక్టర్ ... ఏమిటి. ఈ రోజుకూడ వార్డ్ వుందా ?'

'వార్డ్ కాదు సార్ ... ఎగ్జిబిషన్ ప్రిపరేషన్ వుంది ... శ్రీనివాస్‌గారు మీటింగ్ పెడుతున్నారు. వెళ్లాలి' అన్నాను.

'ఆ...తప్పకుండా వెళ్లాలి ... మీలాంటి కుర్రవాళ్లంతా పనిచెయ్యాలండి మరి ... నేంకూడ వున్నాంకదా...జనరల్ బాడీలో' మామూలు ధోరణిలో నవ్వేశాడు. నేను నెమ్మదిగా నవ్వేశాను. నాకు తెలుసు రాజకి ఎగ్జిబిషన్‌కి మధ్య చాలాదూరం వుంది. ఆనందంగా తిరిగి అందరినీ ఆనందపరిచే రాజుకి యిలాంటిది ఒకసాధనం మరి.

నెమ్మదిగా వార్డులోంచి సర్జికల్ రిజిస్ట్రార్ ఆఫీస్ దగ్గరకు చేరుకున్నాను. అప్పటికే శ్రీనివాస్‌గారు మీటింగు ఆరంభించేశారు. ముందువరసలో యిద్దరు పి. జి. లు రావు, రాము కూర్చున్నారు. వెనుక వరసలో సంధ్య, కల్పన వున్నారు. గుమ్మంవద్ద ఆగి ఆయనను విష్‌చేశాను.

'వాట్ మధు ... యిట్ యీజు నైన్ థర్టీ...కమిన్...కమిన్' అన్నారు ఆయన మ టల్లో కాస్తంత నిరుత్సాహం వుంది.

ఏం చెయ్యను మరి నిద్రలేచేటప్పటికి ఎనిమిది అయ్యింది. తయారయ్యవచ్చేటప్పటికి ఆకాలం పట్టింది. కిక్కురుమనకుండా వెళ్లి కూర్చున్నాను.

ఆయన ఎగ్జిబిషన్‌లో సర్జరీస్టాల్ ఎలా వుండాలి అన్నది వివరించారు. అరగంటలో ప్రసంగం ఆపి—'మనం పెథాలజీ బ్లాక్‌కి వెళ్లి ఎల్లాట్ చేసిన స్పేస్ చూద్దాం రండి' అంటూ లేచారు.

అందరూ ఆయన్ని అనుసరించారు. నేను కొంచం వెనుక నడుస్తుంటే సంధ్య ప్రక్కగా వచ్చింది.

'మీరు మంచిపని చేశారు...చక్కగా జవర్ ఆల్ లేదు...ఒక స్టెత్ లేదు...హాయిగా నడుస్తున్నారు...మేం చూశారా యివన్నీ మోసుకుని వచ్చాం' చేతిలో పుస్తకాలు చూపెట్టింది.

'మీరంతగా మొయ్యలేకపోతే ఆ పుస్తకాలు యిలా యివ్వండి నేను పట్టుకుంటాను...అందులో తప్పేమీలేదు' అన్నాను నవ్వుతూ.

'నో థాంక్యూ' అంటూ తేల్చి నవ్వేసింది.

'ఎనీథింగ్ యువాంట్' అంటూ ముందు నడుస్తున్న డా. శ్రీనివాస్ వెనక్కుతిరిగారు.

'నో సార్' అంటూ తియ్యగా సమాధానం చెప్పింది.

'మీ దగ్గర దవ్ వుంది కదూ?' నెమ్మదిగా అడిగాను.

'ఓ సారీ...మీరు కావాలన్నారుకదూ ? తీసుకురావటం మర్చిపోయాను. అందాకా యీ పుస్తకం వుంచండి' అని యింగ్లీషులో అంటూ అందించింది.

కాగితాలు తిరగబడ్డాయి అది సర్జరీ పుస్తకంకాదు. పారాసైటాలజీ పుస్తకం.

'వో ఆయామ్ వెరీసారీ...ఈ రెండు పుస్తకాలూ ఒకలేలా వుంటాయి' అంటూ కల్పనవైపు తిరిగింది—'దావ్ పుస్తకం అనుకుని యిది తెచ్చేశాను' అంది యింగ్లీషులో. కల్పనకు తెలుగు రాదు. కొంచం కొంచంగా అర్థం అవుతుంది. అందుకే ఆమెతో ఎక్కువగా మాట్లాడే అలవాటు లేదు. ఒక్క సంధ్య వక్కర్తే మాట్లాడుతుంది.

వాళ్లిద్దరూ యింగ్లీష్‌లో మాట్లాడ్తుంటే వో పదికాకులు అరుస్తున్నట్లు వుంటుంది. అది విన్నప్పుడల్లా నవ్వు మాత్రం ఆగేది కాదు.

మెల్లెక్కుతుంటే సంధ్య నావైపు తిరిగింది—'సారీ మధు...ఆ పుస్తకం రేపు యిస్తాను' అంది.

'వో. దట్స్ ఆల్ రైట్' అంటూ చిన్నగా నవ్వి పెథాలజీ బ్లాక్ వైపు నడిచాను.

'ఏంటండోయ్ తుక్కు లేపేస్తున్నారు' ముందు నాల్గుపళ్లు కనుపించేటట్లు నవ్వుతూ అన్నాడు రావు. అతనిదంతా చాలా విచిత్రమయిన తరహా. నిజంగా నిస్వార్థం లేని స్వార్థపరుడు. మనిషిని తేలికగా అర్థం చేసుకోలేకపోయినా కొందరి మనుషుల్ని వాళ్లప్రవర్తన తేలిక చేస్తుంది. అటువంటివాళ్లలో ఈ రావు ఒకడు. అందుకే అతనికి నవ్వే సమాధానంగా యిచ్చేస్తుంటాము.

అందరూ ప్లాన్ తయారు చేయటంలో పడ్డారు. అది ఒకంతట తెగటం లేదు. డాక్టర్ను యింజనీర్లయితే యిలాగే వుంటుంది మరి.

అలా ఒక గంటన్నర సమయం తోక కాలిన పిల్లిలా వాళ్లతో తిరిగాం. అమ్మాయిలు మాత్రం నిలబడలేక పోయారు. అస్తమానూ నాదగ్గరకు వచ్చి ఆంగ్లంతో వాగుతూ వుండేవారు. తెలుగుదేశంలో పుట్టి దాబుగా యింగ్లీషు మాట్లాడ్తూ తెలుగు అంటే ఎలా వుంటదో తెలియదు అనేవాళ్లని నిజంగా డైబిటిక్ పేషెంట్సు అనాలి. ఎందుకంటే కలిగివున్న మిఠాయిలు తినటానికి నోచుకు పుట్టుకోనివాళ్ళు ఈ పేషెంట్సేకదా ?

ఆఖరికిస్టాఫ్ ఎక్కడ ఏదిపెట్టాలిఅన్నది నిర్ణయించుకున్నారు తీరుబడిగా కూర్చుని వర్క్ డిస్ట్రిబ్యూషన్ చేశారు డా. శ్రీనివాస్.

పెళ్లికూతురు వచ్చేసింది. పెళ్లి తతంగం ఆరంభం అయిపోయింది. తాటాకులు లేకపోయినా పెద్దపందిరే వేశారు. బియ్యం కరువైనా పులిహోర ధమాయించి చేశారు. కాస్త కారం ఎక్కువ వేశారేమో రేషనింగ్ బియ్యమే ఎక్కుతిక్కలు... ఎవరూ తినరు కదా? అయినా పెళ్లికొడుకుమాత్రం పత్తా లేడు. ఆయన రాలేదు. ఆయన రావలసిన రైలుకూడ రాలేదు...పాపం ముహూర్తం మాత్రం నోరు తెరిచి కూర్చుంది. అప్పుడు ఆడపెళ్లి వారి బాధ ఎలావుంటుందో అలావుంది మావని. ఎక్జిబిషన్ అంటూ పెడ్తే... అందులోనూ హెల్త్ అండ్ ఫేమిలీ ప్లానింగ్ లాంటిది పెడ్తే ఎంత జాగ్రత్తగా తయారు కావాలి, లేకపోతే జనాలలో ఎంత నగుబాటు అయిపోతుంది. అయినా పరిపాలన కళ్లు మూసుకునివుంటే ప్రజలకుమాత్రం ఏం కనుపిస్తుంది! రెండు రోజులకు ప్రదర్శన ఆరంభం అవుతుందనగా ఆరోజు ప్రిపరేషన్ మొదలుపెట్టాం. చేసేవాళ్లు పది మంది...చెయ్యవలసింది మాత్రం చాలా వుంది. ఒక ఆపరేషన్ థియేటర్‌ని కృత్రిమంగా స్థాపించాలంటే మాటలా?

'మధు... మీరు కూడ డెకరేషన్‌లోకి వచ్చేయకూడదూ?' అంది సంధ్య.

'చంపేశారు...నేను వచ్చి చేస్తే యిక ఎవ్వరూ ఎగ్జిబిషన్ చూడనక్కర్లేదు' ఆఫీస్‌కివెళ్లి ఒక పెద్దబల్ల మోసుకు వచ్చాం. పరువుకోసం చెయ్యక తప్పలేదు.

'యు ఆర్ బికమింగ్ గోలియత్' అంది సంధ్య చిలిపిగా నవ్వుతూ.

'ఈ ఎగ్జిబిషన్ పేరుమీద ఆమాత్రం బలంవస్తే నిజంగా అదృష్టవంతుడ్నే' అన్నాను.

మర్నాడు ఎగ్జిబిషన్ అనగా జరిగిన సంఘటన ఆరోజు స్పెసిమెన్సు అన్నీ అక్కడ సర్దటం మావని. ఉదయం తొమ్మిదింటికి అక్కడ చేరుకున్నాం.

'గుడ్‌మార్నింగ్' అంది సంధ్య.

'హాయ్...వెరీగుడ్ మార్నింగ్'

'దిసీజ్ యువర్ బుక్' అంటూ అందించింది.

'హా. థాంక్యూ' అంటూ అందుకున్నాను.

ఆ తరువాత ఆమెతో మాట్లాడటానికికూడ అవకాశం లేనంతగా పనిలో మునిగిపోయాం.

'మధు' సంధ్య పిలిచింది. అటు ప్రక్కకు తిరిగి చూశాను — 'మీరు మా బేచ్‌లోవుంటే బాగుండును' అంది.

'ఏం బాచ్' అర్థంకానట్లు చూశాను.

'మీరు ఏ బాచ్ వాలంటీర్ మేము బేచ్ వాలంటీర్లం—'

'ఐసీ...అలాగా...అయితే నాకు చాలా బోరింగ్‌గా వుంటుంది' నిరుత్సాహంగా అన్నాను.

'బెటర్ కమ్ యిన్‌టు అవర్ బేచ్' అంది కల్పన.

'యా...ఐవిల్ ట్రై'

'నో మధు... మీరు తప్పకుండా వచ్చేవాలి' అంది సంధ్య గారంగా చూస్తూ.

'హోకే' లనేశాను నవ్వుతూ.

సాయంత్రం ఏడింటికి యింటికి వెళ్తుంటే శ్రీనివాస్ పిలిచారు - 'రేపు ఉదయం మీ డ్యూటీ పదినుండి ఒంటిగంటవరకూ వుండాలి' అన్నారు నన్ను చూస్తూ.

'అలాగే సార్'

'సంధ్య అండ్ కల్పన యువర్స్ కజ్

# మరువలేని కథ!

ఆఫ్టర్‌నూన్‌బేచ్' అన్నారు.

'నో నోసార్ ...మేంకూడ మార్నింగ్ వచ్చేస్తాం' అంది సంధ్య

'దెన్ ఆల్‌రైట్' అనేశాడు ఆయన.

'థాంక్‌గాడ్ ... మార్నింగ్ వుయ్‌విల్ మీట్...గుడ్‌నైట్' అంది సంధ్య బయటకు వస్తూ. నిజంగా తమాషా అయిన అమ్మాయి.

సంధ్య పెద్ద ప్రొఫెసర్‌గారి అమ్మాయి. ఒకే ఒక్క కూతురేమో చాలా గారాబంగా పెరుగుతుంది. అందుకే అందరి దగ్గర కూడ అంతే గారాబంగా వుంటుంది. అతి చనువుగా మాట్లాడ్తుంది. అయితే ఆమె నాకు సెకండియర్‌నుండే తెలుసు. అయినా ఆమెతో పరిచయం కల్గటం ఒక రెండు నెలల నుండే. అప్పటివరకూ ఆమెతో అసలు మాట్లాడి ఎరుగను. దేముడు ఒక విచిత్ర వ్యక్తి. ఎదురుగా తిరుగుతున్నా ఏళ్లు గడిచినా కనుపిస్తున్న మనిషితో కొంతైనా పరిచయం కలిగించడు. మళ్లీ ఆయనకు ఏం బుద్ధి పుడ్తుందోకాని అదే వ్యక్తితో హఠాత్తుగా పరిచయంచేసి, ప్రాణస్నేహం పెంచేసి, జీవితబంధం వేసేస్తాడు.

ఆ రోజు ఎగ్జిబిషన్ ఆరంభం అవుతుంది. తొమ్మిదింటికే స్టాల్ చేరుకున్నాం. ప్రొఫెసర్‌కూడ వచ్చేశారు — 'మీరు డైబిటిక్ కార్బంకిల్ గురించి చెప్పండి' అంటూ స్పెసిమన్ చూపించారు.

'అలాగే సార్' అని అక్కడ కూర్చున్నాను. సంధ్య కేన్సర్‌లిప్ చెప్తుంది. కల్పన కేన్సర్‌ఫుట్ చెప్తుంది.

'మధు కాన్సర్‌కి తెలుగులో ఏమంటారు?' సంధ్య యింగ్లీషులో అడిగింది.

'ఏం మీకు తెలుగు రాదా?'

'అబ్బ...గాదు...నాకు...యిటువంటివి రావు నాకు' అంది.

'కేన్సర్ అంటే పుట్టకురుపు...'

'అది సరే ... దాన్ని ఎలా చెప్పాలో చెప్పండి?' మొఖం తమాషాగా పెట్టింది.

'ఇది పుట్టకురుపు. పెదవిమీద పుట్టకురుపు ... పొగాకుకాల్చటం, నమలటం చెయ్యటం వలన ... మత్తు పానీయాలు త్రాగటంవలన వస్తుంది ... ఊ...చెప్పండి' అని నవ్వాను.

'ఇది ఫుట్టకురుపు ... పెదిమపై వస్తుంది...'

'నోనో...ఫుట్టకురుపు కాదు...' అంటూ ఆమెనిసకి ఫకాలున నవ్వాను.

'అబ్బ...అలా నవ్వితే ఎలా...చెప్పండి' అంది విరిసిగా.

'అదే! చెప్తున్నానుకదా...ఇది పుట్ట కురుపు...పుట్ట...'

'ఆ...యిది పుట్టక్కురుపు...పెదిమపై వస్తుంది...చుట్ట అది తాగక్కూడదు' అని తెలుగు రానట్లు అంటుంటే ప్రక్కనున్న వాళ్లందరూ నవ్వారు. నవ్వు ఆగేదికాదు. నేనుకూడ నవ్వాను.

'వాట్...యు ఆర్ లాఫింగ్ ఎట్ మీ' అంది కోపంగా.

'నోనో...మిమ్మల్ని చూసికాదు...మీ మాటల్ని చూసి ... అసలు మీకు తెలుగు ఎందుకు గాదు? తెలుగువారుకారా?'

'అఫ్‌కోర్స్ ... తెలుగువారమే అనుకోండి ... యు నో మధు! నా చదువంతా నార్త్ ఇండియాలోనే జరిగింది ... మా ఫాదర్ ఆర్మీలో వుండేవారు కదూ ... అందుకని అక్కడే చదువుకున్నాను ... హిందీ బాగా తెలుసే' అంది విరిసిగా నవ్వుతూ.

'తో మెయిమ్ సాబ్... ఆప్ హిందీమే బాత్ కర్ సకతేహై ఔర్ బతాబి సకతె హైతో హిందీ మేహీ బోలియే'.

'అరె బాబా ... ...యిసాకర్‌నే సే ...ంహా జగడా కరేగా మురఖ్‌సే' అంద






# మజా మజాగా ఉండండి... గోల్డ్ స్పాట్ త్రాగండి!



mcm/pb/13b tel

గోల్డ్ స్పాట్-ఇప్పుడే మీ కోసం ప్రత్యేకంగా
తాలిచి ఇవ్వబడిందని పించే తాజా రుచి.
గుటకలు మింగించే రుచితో, జీవం తొణికిసలాడే
గోల్డ్-స్పాట్. హుషారుతో మీ ఒంట్లో రక్తం
పరవళ్లు త్రొక్కేటట్లు చేస్తుంది. మజా మజాగా
ఉండండి. గోల్డ్ స్పాట్ త్రాగండి.

**తాజా రుచి కోసం గోల్డ్ స్పాట్**

కాలును నవ్వుతూ.

'తో ఆప్ క్యాకర్‌నా చాహతీహై?'

'తెలుగులో చెప్పటం నేర్చుకుంటాను...' అంది వత్తి పలుకుతూ.

'జరూర్ ... అది మంచివారి లక్షణం' అన్నాను వొక్కి పలుకుతూ.

'బివిత్ మి ఫర్ ఎ ఫ్యూ మినిట్స్' అంది.

'అరె మళ్లీ యింగ్లీష్ ఏమిటి... తెలుగులో మాట్లాడండి...లేకపోతే రాదు' అన్నాను చిరుకోపంతో నవ్వుతూ.

'వో...అలాగే' అంటూ విజిటర్స్‌వైపు తిరిగింది. అక్కడే నిలబడివుంటే బాగుండదని నా స్పెసిమెన్ దగ్గరకు వచ్చేశాను. అప్పటికే స్టాఫ్ అంతా మావైపు అదోక రకంగా చూడటం గమనించక పోలేదు.

ఏ మగవాడయినా ఏ ఆడదానితోనో కొంచం చనువుగా వుంటే గూఢార్థాలు సృష్టించేబుద్ధి ఈ సంఘానికి ఒక కారెక్టర్‌గానే వుంది. అదీ ఎక్కువగా ఈ తెలుగు దేశంలో సంఘం ఎలాంటిదో తెలిసి, మనుషులు ఎలాంటివారో తెలిసి మనకు మనం లొంగిపోవటం అవివేకం అవుతుంది. మంచిని మరుగుపరచాలని, లేనిది సృష్టించాలి అని అనుకునే సంఘాన్ని ఎదిరించి

# మరువలేని కథ!

నిలబడటం ధీరత్వమేకాని అది ఏ ఎదురు దెబ్బతిన్నా తీరని ఆవేదనగా మారి మనిషిని మానవత్వాన్ని కూడ దహించి వేస్తుంది. అందుకే అన్నింటికీ మంచిది, అందరికీ తేలికయినదీ ఒకే ఒక్కమార్గం—అదే తప్పించుకుని తిరగటం. మనిషినుండి, సంఘంనుండీ, చివరకు తనకు తానే తప్పించుకుని తిరిగితే మనిషి నిర్మలంగా గమ్యస్థానం చేరుకుంటాడు. కర్తవ్యాన్ని నెరవేర్చుకుంటాడు.

సంధ్య నాదగ్గరికి రాలేదు. నిశ్చింతగా వూపిరి తీసుకుని వదిలాను. డాక్టర్ కృష్ణతో మాట్లాడుతున్నాను. సంధ్య వచ్చింది.

'మధు...మై ప్రెజెంటేషన్' అంటూ కాగితం వుండగా చుట్టి అందించింది.

'ఇందులో ఏమయినా వుందా ... లేక ఏ రాయిముక్కో కట్టి యిస్తున్నారా?'

'నో...ఐ యామ్ నెవ్వర్ చీట్‌యు... సి అండ్ సీ' అని వయ్యారంగా నవ్వుతూ వెళ్లిపోయింది.

'కృష్ణా...యిది ఏదయితే అందులో సగం మీకు' అంటూ పొట్లం విప్పాను.

'థాంక్యూ' అంటూ సంధ్య వెళ్లిన వైపు నడిచాడు.

అందులో చాక్లెట్ వుంది. ఉన్నది ఒక్కటే ఒకటి. తప్పదు సగం యివ్వాలి.

'సారీసార్...ఒకే చాక్లెట్ వుంది... ముక్క యిస్తున్నాను' అంటూ పేపర్‌తో కొరికి అందించాను. వద్దనకుండా అందుకున్నాడాయన.

'వో దెన్ అయామ్ టెరిబుల్లీ సారీ... అయ్ హేడ్ ఎ సింగిల్ ఒన్' అంది సంధ్య.

'నెవ్వర్ మైండ్' అని కృష్ణ అంటుంటే అక్కడనుండి వచ్చేశాను.

సంధ్య తమాషా అయిన వ్యక్తి అనుకోవటం పొరపాటు. ఆమె ఏదో వూహించి ఏదో చేసేమనిషి అని అనుకున్నాను. ఆమెకులేని స్నేహితులు లేరు. ప్రతీ మగవాడు, ఆడది, చివరకు స్టాఫ్‌కూడ స్నేహితులే. అందరూ తనతో మాట్లాడుతుంటే ఏదో చాలాగొప్ప అనుకున్నట్లుగా ఆ భావం వ్యక్తం చేస్తుంటుంది. ఇటువంటివాళ్ల భవిష్యత్తు ఒక మరపురాని కథ కాదు కదా అనిపించింది.

రెండవరోజున మధ్యాహ్నం డ్యూటీకి ఒంటిగంటకు వెళ్లాను.

'గుడ్‌నూన్...' సంధ్య గొంతుక తియ్యగా వినిపించింది.

'గుడ్‌నూన్...' అంటూ అటు చూశాను.

'మైగిఫ్ట్...' ఒక పేకెట్ అందించింది.

'థాంక్యూ...' అంటూ అందుకున్నాను.

'గూస్ బెర్రీస్ మధు ... ఉప్పుకారం కూడా వుంది'

'వోహో ... వుసిరికాయలా' అంటూ కాయ తీసుకుని తిన్నాను.

పుల్లగా వున్నాయని అందరికీ పంచి పెట్టేశాను. సంధ్య నావైపు కోపంగా చూసింది. అందులో రాతప్పేముంది? ... నన్ను ఏడిపించటానికి వుసిరికాయలు తెచ్చిందేమోనని అలా చేశాను.

అదేరోజు ఆపరేషన్ థియేటర్‌లో వుంటే నాల్గు స్వీట్స్ తెచ్చియిచ్చింది. కల్పన కూడ వో రెండుయిస్తే చిత్రమయిన మనుషులనుకుని నమిలేశాను.

మూడవరోజు ఎగ్జిబిషన్ హృదయం



డ్యూటీకిబయలుదేరాను. వెళ్లిన పది నిముషాలకి సంధ్య వచ్చింది—'యివి మీకే... మీరే తినాలి...చాలా బాగున్నాయి' అంటూ అందించింది.

'ఒక్క కాయకూడ ఎవ్వరికీ యివ్వను సన్...నేనే తింటాను సరేనా' అంటూ వుసిరికాయలు అందుకున్నాను.

'స్యాప్...స్యూర్...ఉప్పుకారం దట్టించాను.. బాగుంటాయి' చిన్నగా నవ్వింది. నేను తినటం మొదలుపెట్టానో లేదో నది మంది చూడటం— నన్ను అడగటం— నేను యివ్వటం—అన్నీ జరిగిపోయాయి. సంధ్య నిరుత్సాహంగా చూసింది.

కాలితో పుట్టుకురుపు గురించి చెప్పాన్నాను. నా ప్రక్కనే సంధ్య రాచకురుపు గురించి వచ్చీరాని తెలుగుతో కష్టపడి చెప్తుంది.

'మధు' నెమ్మదిగా పిలిచింది. ఉలిక్కిపడి ఆమెవైపు తిరిగి చూశాను. నా ముందుకు వంగ రెండు చాక్లెట్లు అందించింది.

'థాంక్యూ' అంటూ అందుకుంటే అసిస్టెంటు ఒకాయన అలా వచ్చాడు.

'ఏమండీ మాకేమీ పెట్టరా?' అన్నాడు.

సంధ్య నిరుత్సాహంగా ఫకాలున నవ్వింది. నాకు కూడ నవ్వు ఆగలేదు

'అదేం మాటసార్...కమాన్‌సార్ హేవ్ యిట్' అంటూ అందించాను. ఆయన పాపం సిగ్గుపడిపోయి తీసుకోకుండా వెళ్లిపోయాడు.

'మధు' మళ్లీ సంధ్య పిలిచింది.

'ఆ...' అంటూ అటు తిరిగాను.

'ఎంత రహస్యంగా వుంచుతామన్నా మన సంగతి అందరికీ తెలిసిపోతుంది... ఏం చెయ్యాలి?' అంది. ఆమె మాటల్లో ఏదో దాచిపెడుతున్నట్లనిపించింది.

'మీరు రహస్యాన్ని రహస్యంగా వుంచటంలేదు మరి...అందరూ చూస్తుండగా తీసి వస్తువులు యివ్వకూడదు' అన్నాను వెక్కి పలుకుతూ.

ఆమె ఏమీ మాట్లాడలేక తల తిప్పుకుని నవ్వుకుంది

మర్నాడు డ్యూటీకి వెళ్లాను. 'సంధ్య...కానుక' అంటూ పేకెట్‌తో స్వీట్స్ తీసి అందించాను.

'థ్యాంక్యూ' అంటూ తెగ మురిసిపోయింది. కల్పన ఆమెకలసి గందరగోళం చేస్తూ గూడ్స్ బండిలా దడదడామని యింగ్లీషులో మాట్లాడుకుంటూ తినడం మొదలుపెట్టారు

కల్పన నాదగ్గరకు వచ్చింది—'వాట్ ఈజ్ దిస్ క్రౌడ్' అంది.

'యా...వేర్ ఈజ్ సంధ్య?'అని అడిగాను.

'షి హేజ్ గాన్ ... యునో వుయ్యార్ గోయింగ్‌టు సన్‌అండ్‌సి ఫర్ ఎ డాన్స్'

'వాట్...దెన్...రిజర్వ్ అజ్ వన్ టేబిల్' అంది.

'ఓకే' అని నెమ్మదిగా నవ్వాను.

ఆరోజు సన్‌అండ్‌సీలో ఒక పెద్ద హోపెన్‌డాన్స్ ప్రోగ్రామ్ మల్లి నేను వెళ్దామనుకున్నాం. బాగుంది ఎనిమో పని పిల్లనికూడ పట్టవచ్చునని పించింది.

ఏడింటికి సన్‌అండ్‌సి చేరుకున్నాం. అందరికీ కలిపి మల్లి ఒకటేబిల్ రిజర్వు చేశాడు. వచ్చేవాళ్లకి చాలామంది జనాలు వస్తున్నారు ఏడున్నర దరిదాపులకి సంధ్య, కల్పన తిరుపతి, కంగారుగా టాక్సీలో వచ్చారు.

'అరె...మీరు యింకా యిక్కడే వున్నారా? లోపలికివెళ్లి కూర్చోపోయారా' అంది సంధ్య యింగ్లీషులో.

'ఫర్వాలేదు...రండి' అన్నాను చిరాకుగా.

'ఉయ్యార్ వెరీసారీ' అని కల్పన అంటుంటే మల్లిని చూపిస్తూ—

'హీ యీజ్...మిష్టర్‌మల్లి... అసిస్టెంటు యింజనీరు' అని పరిచయం చేశాను.

'షి యీజ్...మిస్ సంధ్య ... అండ్ షి యీజ్ మిస్ కల్పన' అంటూ వాళ్లిద్దరినీ చూపించాను. మల్లి హుషారుగా చనువుగా చెయ్యిచాపి షేక్‌హేండ్స్ యిచ్చాను.

వాళ్లు నిజంగా బిత్తరపోతుంటే నాకు నవ్వు ఆగలేదు.

లోపలికి వెళ్లాం. నాట్యం చాలా రమ్యంగా సాగుతుంది. గిటార్, జాజ్, బెజోస్, సెల్లోవంటి వాయిద్యాలు తియ్యని పాశ్చాత్య సంగీతం వినిపిస్తున్నాయి. రంగురంగుల బంతులతో, యువతీ యువకులతో నిండుగా వుంది. కల్పన, సంధ్య డాన్స్ చూడటంలో మునిగిపోయారు. మల్లి వాళ్లలో కబుర్లలోకి దిగాడు. నాకు మాత్రం బోరింగ్ అనిపించింది. మరొక అరగంటకి ఆ నాట్యం చూడటానికే విసుగేసింది. మల్లికి చెప్పి బయటకువచ్చి

## డాక్టర్ కబుర్లు

# కాపడం

దెబ్బ తగిలితే కాపడం వచ్చు. పెద్దారు చాలా మంది ఎంత వేడి ఉంటే అంత మంచిదని గూడా అంటారు.

ఇది కొంతదాకా నిజమే. వేడివల్ల రక్త ప్రవాహం ఎక్కువ అవుతుంది. ఇది గుణం ఇస్తుంది. కాని, కాపడంవల్ల కందటం, వాపు ఏర్పడవచ్చు. బాధ అధికం కావచ్చు. కొన్ని సమయాలలో రక్తనాళాలు పగల

చేతి దెబ్బలకి కాపడంపెడితే



వేడినీరు కంటే గోరువెచ్చటి నీరే మంచిది!

(కాపీరయిటు)

స్విమ్మింగ్ పూల్ దగ్గర కూర్చున్నాను.

అరగంట తరువాత వాళ్ళముగ్గురూ బయటకు వచ్చారు — 'వాట్ మధు యిజ్ యిట్ బోరింగ్ టు యు' అని అడిగింది సంధ్య.

'అఫ్ కోర్స్' అంటూ నవ్వి వాళ్ళను అనుసరించాను.

'కెన్ అయ్ డ్రాప్ యు ఎనీ వేర్' అని పార్క్ చేసి ఎదురు చూస్తున్న కారువైపు వెళ్ళింది.

'హో థాంక్యూ...వుయ్‌గోటు రామక్రిష్ణ మిషన్'

'దెన్ గెట్ యిన్'.

వాళ్ళిద్దరూ వెనుక కూర్చున్నారు. నేను మళ్ళి ముందు కూర్చున్నాం. నిముషాలలో గమ్యం చేరుకున్నాం. కారు దిగుతుంటే సంధ్య అంది.

'లెటజ్ సెటిల్‌ది మనీ...టుమారో' అంది. ముందు నాకు అర్థం కాలేదు. మళ్ళి తిరిగి అంటుంటే జవాబిచ్చాను — 'లెటజ్ సెటిల్ యిట్ ఆఫ్టర్ వర్డ్స్.

'మళ్ళి 'థాంక్యూ' అని చెప్తుంటే కారు కదిలింది.

మర్నాడు పదింటికి ఎగ్జిబిషన్‌కి వెళ్ళాను. సంధ్య ముందే వచ్చింది. నన్ను చూసి 'హాయ్' అంది ముభావంగా.

ఎందుకా అనుకుని — 'హాయ్' అని ముందుకు వెళ్ళిపోయాను.

# మరువలేని కథ!

సంధ్య దగ్గరకు వెళ్ళాను—'సంధ్య... యుగాట్ ఎనీ స్వీట్స్' అన్నాను.

'నో' అని అదోలా నవ్వింది. ఆమె ఏదో జరిగిందని బాధపడుతున్నట్లనిపించింది. నేను మళ్ళి సంధ్యని పలకరించలేదు: ఫైనల్ యియర్ విద్యార్థి హరితో కబుర్లు ఆరంభించింది. చూసీ చూడనట్లు నన్ను గమనిస్తుంది. అలా అతనితో సర్దాగా వుంటే నేను వుడుక్కుంటా ననుకుంది. కాబోలు...పూర్ గర్ల్, నాకుమాత్రం ఆమెమీద జాలి వేసింది. ఆమె తెలివితక్కువ తనానికి నవ్వు ఆగలేదు.

నేను చూస్తుండగానే కిశోర్ అని ఫిఫ్తియర్ అబ్బాయి ఒకడు వచ్చాడు. అతను కల్పనకు స్నేహితుడని అప్పటి వరకూ తెలియదు. విజిటర్స్ వున్నారన్న సంగతి మర్చిపోయి చనువుగా మాట్లాడు కుంటున్నారు. కిశోర్ ఏదో అంటూ కల్పన నుదుటమీద చెయ్యి వేసి చూశాడు. ఆ సీన్‌ని నా కళ్ళు ఫోటో తీసేశాయి. ఆడది ఎంతకయినా తగునుకదా అనుకున్నాను. అయినా నాకు నవ్వు ఆగలేదు. నేనుమాత్రం కంగకుండా థీవిగా అక్కడే నిలబడి అంతా చూశాను.

ఆ రోజు డ్యూటీ పూర్తి కావటానికి అరగంట వుందనగా కల్పన అక్కడకు వచ్చింది.

'యువర్ మనీ' అంటూ ఆరు రూపాయలు అందించింది.

'ఎవరి మనీ' ఆశ్చర్యంగా చూశాను.

'డాన్స్‌కి అయిన ఖర్చు' అని యింగ్లీషులో చెప్పింది.

'నో నో...మీరిచ్చినా షేం ఎలా పుచ్చుకుంటా మనుకున్నారు..యిదేం బాగాలేదు.'

'మాకు.. మీరు పెట్టుకోవటం ఏమిటి ...అది అన్యాయం' అంది అచ్చ యింగ్లీషులో.

'అన్యాయం అది అనిపించుకోదు... ఏదో అప్పుచేసినట్లు యిలా తిరిగి యివ్వటం అన్యాయం అవుతుంది...టేక్ బేక్ యువర్‌మనీ' అన్నాను.

'నో...యుషుడ్‌టేక్ యిట్...' అంటూ ఆ కాగితాలు బల్లమీద వదిలేశాను.

'యిటీజ్ నాట్‌గుడ్...' అంది. అప్పటికే ఆమె ముఖంనిండా చెమటలు పట్టేశాయి.

'చూడండి ... కల్పనా ! మిమ్మల్ని మేము ఒక డాన్స్‌షోకి తీసుకువెళ్ళాం... మీరు వచ్చారు. వచ్చినందుకు యిప్పుడు డబ్బు తిరిగి యివ్వాలనుకుంటున్నారు... అది మంచితనం అనిపించుకోదు...చేతనయితే మమ్మల్ని షోకి తీసుకువెళ్ళి బదులు తీర్చుకోండి...అంతేకాని మీరు డబ్బు యిస్తే మేం తీసుకోవటం ఏమైనా బాగుంటుందా ? అసలు సభ్యతగా వుంటుందా' అని గంభీరంగా చెప్పేటప్పటికి చేసేదిలేక డబ్బు తీసుకుని అవమానం పొందినట్లు గంభీరంగా ముఖంపెట్టి వెళ్ళిపోయింది.

మర్నాడు మోర్నింగ్ డ్యూటీకి వస్తున్నాను. నాముందు కిశోర్ కల్పన వెళ్ళారు. నేను పలకరించలేదు, వాళ్ళు చూడనూ లేదు. నా వెనుక సంధ్య రావటం చూశాను. ఎవరితోనో కలసి వస్తుంది. నన్నుచూసి వుల్లాసంగా కబుర్లు ఆడుతుంది. అటువంటప్పుడు వెళ్ళి గౌరవంగా పలకరించటం మంచిది కాదని చూడనట్లు పైకి వెళ్ళిపోయాను. డిపార్ట్‌మెంటులో కల్పన కనుపించింది—'హల్లో సర్జన్' అని కోతిలా వెక్కిరించింది. నేను నిజంగా [illegible] — 'డోంట్ [illegible]



టూ యాంక్షస్' అన్నాను కోపంగా. డైబిటిక్ కార్బంకిల్ చెప్పటానికి నిర్ణయించుకున్నాను, సంధ్య నాదగ్గరికి వచ్చింది.

'మధు...యిది నాకు యివ్వండి...నేను చెప్తాను' అంది.

'ప్లీజ్...అవన్నీ చెప్పి విసుగెత్తిపోయాను — యింకేదయినా చెప్పండి...' అన్నాను. కోపంగా వెళ్ళి ప్రొఫెసర్‌కి చెప్పింది. ఆయన నా వైపు వచ్చారు.

'మీరు ఏదయినా చెప్పగలరు...లేడీస్‌కి ఛాన్స్ యిచ్చేయండి' అన్నారు. ఆయన మాట కాదనలేక నవ్వుతూ లేచాను. సంధ్య ఠీవిగా ఆ ప్రదేశం ఆక్రమించుకుంది. ఆమెకు ఎదురుగా టీవిగా నవ్వుతున్న హారి కనుపించాడు. 'ఆహా! యిందుకా?' అనుకున్నాను. అరగంటయ్యింది. నాకు కొంచందూరంలో కృష్ణ అని హౌస్‌సర్జన్ వున్నాడు. నాతో సర్దాగా మాట్లాడుతున్నాడు. ఇదంతా కల్పన చూస్తుంది. అప్పుడప్పుడు మూతి తిప్పుకోవటం వెక్కిరించటం చేస్తుంది.

'ఏమిటే అలా వెక్కిరిస్తుందేమిటే... ఎవరిని?' అన్నాడాయన.

'చెప్తాను...అదొక పెద్ద కథలెండి' అంటూ చేతిలో'న్న పేపర్ ఆమెమీదకు విసిరాను. అది కృష్ణ పట్టుకునే లోపలే కల్పన మీదపడింది. కోపంగా నా వైపు చూసి వెక్కిరించింది.

'అయ్ విల్—సియు'అంది.

'వాట్ యు విల్ సి? ... అనుకోకుండా పడినదానికి నేను ఏం చేస్తాను?'

'అదే.. అల్లాగే ... అల్లాగే' అంది కోపంగా.

నా మనస్సు చివుక్కుమంది. అనవసరంగా ఈ పిచ్చిముఖాలతో తగవు తెచ్చుకోవటం ఏమిటి అనుకున్నాను.

డ్యూటీ లవ్వటానికి అరగంట వుందనగా సంధ్య లేచి నావైపు చూస్తూ, ముద్దు పెడుతున్నట్లు మూతి ముడిచింది. ఆ వెక్కిరింపుకి ఏ మగవాడయినా కదిలిపోతాడేమో అనిపించింది. పిచ్చిది! అలా ఎందుకు అన్నదో అర్థం కాలేదు.

మర్నాడు ఆఖరిరోజు. చాలా రద్దీగా వుంది. ఎక్కడలేని జనాలు అక్కడే వున్నారు. ఈ కొత్తకథ మధ్యలో అర్థం

## మరువలేని కథ!

కకుండా మలుపులు తిరిగి పోవటం చాలా విసుగెత్తించింది. సంధ్య, కల్పన పూర్తిగా మాట్లాడటం మానేశారు. ఎందుకా అని ఆలోచించవలసిన అవసరం రాలేదు. ఏదో ఆకతాయి స్నేహం అమ్మాయిలతో యిలాగే వుంటుంది అని అనుకున్నాను. అంతకు మించితే కొంపలు అంటుకుపోతాయని తెలుసుగా?

మధ్యాహ్నం మూడింటికి స్టాల్‌కి వెళ్ళాను. ఎదురుగా సంధ్య కనుపించింది హరి ప్రక్కన కూర్చుని కబుర్లాడు తుంది. వాళ్ళిద్దరి మధ్య యింగ్లీషు నవల కనుపించింది.

'ఏం మధు ... యిదేనా రావలసిన టైమ్?' అని అడిగింది. నేను ఆశ్చర్య పడ్డాను.

'డోంట్ వర్రీ...నా వాచీ సరిగానే పని చేస్తుంది' అని ముందుకు వెళ్ళిపోయాను.

అరగంట వరకూ విజిటర్స్‌కి వివరించాను. ఓపికలేక విసుగుపుట్టి బయటకు వచ్చాను. నా అతిథులకోసం చూశాను. ఎవరూ రాలేదు. నాల్గున్నరదాకా కాంటీన్‌లో కూర్చుని శేషగిరితో కబుర్లాడాను మళ్ళీ స్టాల్‌కి వెళ్ళేటప్పటికి అక్కడ సుమారు ఎవ్వరూ లేరు. జనం మట్టుకు క్రిక్కిరిసి పోయి వున్నారు. మళ్ళీ క్రిందకు వచ్చాను. ఎదురుగా సంధ్య. కల్పన కనుపించారు— 'వేర్ ఆర్‌యు గోయింగ్' అని అడిగింది.

'అయ్ వాంట్ టు గో సమ్‌వేర్' యిండియన్ యింగ్లీషులో రుసరుసలాడి జవాబిచ్చాను.

'అయ్...వాంట్‌టు...గో సమ్‌వేర్'అని తిరిగి అంటూ కల్పన వెక్కిరించింది. సర్లే నీ తెలుగుకంటే అద్దానం కాదులే అనుకుని ఊరుకున్నాను. సంధ్య మాట్లాడలేదు.

మళ్ళీ స్టాల్‌కి వచ్చాను. అక్కడ ఎవ్వరూ లేరు. విసుక్కుంటూ వెళ్ళి లివర్ కార్సినోమా దగ్గర కూర్చున్నాను. సంధ్య వచ్చింది.

'థాంక్‌యూ'

'ఓహో...యిది మీదేమిటి ... అయితే థాంక్స్ హరికి చెప్పండి' అన్నాను.

ఎందుకో తెలియదుకాని నిరుత్సాహంగా నవ్వింది. ఆ ప్రక్కనే రాచకురుపు దగ్గర చేరాను.

'మధు...నేను మద్రాసు వెళుతున్నాను'

'చాలా సంతోషం'

'వెళ్ళేముందు మీతో ఒకటి చెప్పాలని' నావైపు సూటిగా చూసింది.

'అసలు ఎందుకు వెళుతున్నారో చెప్ప లేదు?'

'మా కజిన్‌సిస్టర్ మారేజ్‌కి'

'అయితే ఎప్పుడు వెళుతున్నారు... ఎప్పుడు తిరిగి రావటం?'

'రేపే బయలుదేరుతున్నాను...మళ్ళీ వీక్ డేస్ తరువాత తిరిగి వస్తాను.'

'అయితే వచ్చేటప్పుడు నాకు ఏం తీసుకు వస్తారు?' అడగాలనే అడిగాను.

'నథింగ్...ఏమీ తీసుకురాను' తేల్చి నవ్వింది.

'ఏమీ తీసుకురాకపోతే మీతో మాట్లాడటం మానేస్తాను' బెదిరించాను.

'నో నో...అయ్‌వోంట్ బ్రింగ్ ఎనీథింగ్' తేల్చి నవ్వేసింది.

నేను ఏం మాట్లాడకుండా అక్కడ నుండి లేచి వచ్చేశాను.

సాయంత్రం ఏడింటి వరకూ కేంటిన్‌లో కూర్చున్నాను. మల్లి,రాజా అందరూ వస్తే వాళ్ళతో గాసిప్ కొడుతూ వుండిపోయాం.

'తుమ్‌బిన్ జావూంకహా' అన్నపాట వినిపిస్తుంటే సంధ్య అక్కడికి వచ్చింది. నన్ను చూసింది. ముఖం త్రిప్పుకుంటూనే చూశాను.

ఆరోజు చివరి దర్శనాలేమో జనం క్రిక్కిరిసి పోయివున్నారు. సంధ్య బ్యాంక్ వైపు వెళుతుంది. నేనుకూడ లేచి బయటకు వచ్చాను.

నాముందు కారు ఆగింది. ఉలిక్కి పడ్డాను. హార్న్‌కొడుతూ మాధవి ముందుకు



# మరువలేని కథ!

చూసింది.

'ఉ...అబ్బాయిగారు యిక్కడ పెత్తనాలు చేస్తుంటే నాకు ఎక్కడ కనుపిస్తారు... రండి...కారు ఎక్కండి' అంది అందంగా నవ్వుతూ.

అసలే అందంగా వుండే మాధవి అంత అందంగా నవ్వుతుంటే కష్టాలన్నీ మర్చిపోయి హుషారుగా కారు ఎక్కాను.

'అదికాదు మాధవీ ... ఏం జరిగిందంటే...'

'అ ... నాకేం చెప్పక్కర్లేదుకాని ... యింతకీ నాకు ఎగ్జిబిషన్ చూపెడ్తావా లేదా?'

'అరె...ఎందుకంత కోపం ... నీకోసం ఎంతసేపని ఎదురు చూడమంటావు? ఇంకో నిముషం చూసి అత్తకి ఫోన్ చేద్దామనుకున్నాను' అన్నాను రీవిగా.

కారు పెథాలజీబ్లాక్ దగ్గరకు తీసుకు వెళ్లి ఆపింది—'నిజం చెప్పు బావ ... నిజంగా నా కోసం చూస్తున్నావా?'

'హో నచ్'

'అబద్ధం చెప్పటం రానప్పుడు చెప్పకూడదు...నేను వచ్చి అరగంటయ్యింది... నీకోసం కనుపించిన అడ్డమైన వాళ్లందరినీ అడిగాను?'

'ఏమని?' ఫక్కున నవ్వాను.

'డా. మధుబావ ఎక్కడని?'

'యింకా నయం ... మా ఆయన ఎక్కడని అడగలేదు కదా?'

'ఛీ ఫో...డాక్టర్ గారికి తెలివి ఎక్కువయిపోతుంది...' అంది కోపంగా నవ్వుతూ.

'తెలివి సంగతి తీరుబడిగా ఆలోచిద్దాం ముందు నడు నీ మొక్కుబడి తీర్చేస్తాను' అంటూ కారు దిగాను డోర్ లాక్‌చేసి. మాధవి నన్ను అనుసరించింది. నా ప్రక్కన మాధవి నడుస్తుంటే ఆ ప్రక్కకే అందరూ చూస్తుంటే నా మనస్సు వారేవా? చెప్పలేనంతగా ఆనందించింది.

అపరేషన్ థియేటర్ దగ్గర సంధ్య కనుపించింది. నేను చూశాను. ప్రక్కన మాధవి వుండికదా తలబిరుసుగా నటిస్తూ ముందుకు వెళ్లాను.

'మధు' సంధ్యే పిలిచింది. అగి వెనక్కు తిరిగాను—'మాధవి ఒక్క నిముషం' అని సంధ్యవైపు నడిచాను.

'వాట్ ఆర్ యుం డూయింగ్ ఆల్‌దిస్ టైమ్' అంది తమాషాగా నవ్వుతూ. నేను సమాధానం యివ్వాలనుకునేటంతలో సంధ్య అందుకుంది. 'హి యీజ్ డాక్టర్ మధు...ఎ రైటర్' అంటూ ప్రక్కనున్న ఎవరో డాక్టర్‌కి పరిచయం చేసింది.

'మీరు నిజంగా వ్రాస్తారా?' అని నో పిచ్చిప్రశ్న అడిగాడు ఆయన.

'ఆ...రోజాపువ్వు అన్న సీరియల్ నవల చదువుతున్నారుగా ... అది నేను వ్రాసిందే.'

'అయ్‌సీ...అయితే ఆ మధు మీరే నన్నమాట.'

'ఆ' అని సంధ్యవైపు తిరిగాను—'సి సంధ్య...ఆవిడ ఎవరో తెలుసా?' అంటూ దూరంగా నిలబడ్డ మాధవిని చూపించాను.

'ఎవరు?'

'మాధవి...నా మిసెస్' అన్నాను చిన్న అబద్ధం ఆడస్తూ.

'వాట్...' నిశ్చేష్టురాలయి పోయి నవ్వలేక నవ్వింది.

'దెన్‌సంధ్య...మాధవికి కాస్త యిదంతా చూపెట్టాలి. మేం వెళ్తాం' అన్నాను.

'వో. కె...మీకు ఒక్కటి యివ్వాలను కున్నాను...ఆ మీామనీ నా దగ్గరే వుంది'

'మనీ? వోహో అదా ... నే నెప్పుడో చెప్పానుగా మీరు మనీ యివ్వటానికి వీల్లేదు...రిపే యిన్‌ది సేమ్ మేనర్... ఒకవేళ యీ జన్మలో కాకపోతే వచ్చే జన్మలో అయినా యివ్వవచ్చునుగా?'

'లేదు మధు...వచ్చే జన్మలో కూడ మీరు నన్ను మోసం చెయ్యవచ్చుకదా?' అని నిరుత్సాహంగా నవ్వింది.

'దెన్ ఆల్‌రైట్' అని దూరంగా నిలబడ్డ మాధవివైపు వెళ్తుంటే ప్రక్కకు తిరిగి వానిటీ తెరిచి తెల్లటి కవరు తీసి చింపటం నాకు కనిపించింది. వెనక్కు చూశాను. చింపిన కాగితాలు వానిటీలోనే వేసుకోవటం చూశాను. నా మనస్సు ఎందుకో చివుక్కుమంది.

ఎగ్జిబిషన్ చూపిస్తూ మాధవిని మా స్టాల్ దగ్గరకు తీసుకువెళ్లాను. కల్పన నావైపు చూపింది. వెక్కిరిస్తున్నట్టు

# టాప్ రహస్యము!



CIBA (India)

క్రొత్త బినాకా టాప్‌లో మాత్రమే ఒక రహస్యమైన పదార్థము ఉంది కనుక యీ టూత్ పేస్టు మీ నోటిలో అన్ని మూలలకు, పళ్ల మధ్య చిన్న చిన్న సందులలోనికి చొచ్చుకొని పోయి, ఆ చోట్లలో ఉన్న సూక్ష్మ క్రిములను నాశనము చేస్తుంది. అందుకనే మీ నోరు రోజంతా సంపూర్ణముగా శుభ్రముగా, పూర్తిగా తాజాగా ఉంటుంది. అలా మీ నోటి ఆరోగ్యమునకు సంపూర్ణ రక్షణ కలుగుతుంది!

ఈ నిదర్శనమును మీరు చూడగలరు! పరిశోధనాగారములో జరిగే యీ పరీక్షను నేడే మీ యింట్లో చేసి చూడండి!



ఒక గాజు గిన్నెను తీసుకొని దానిలో నీరు పోయండి. బొగ్గు గుండను లేక రంగు పొడరును నీటి మీద చల్లండి.



బినాకా టాప్‌ను కొంచెము నీళ్లలో కలపండి. ఆ ద్రావకము ఒక చుక్కను గాజు గిన్నె మధ్యలో వేయండి.



బినాకా టాప్ ఎంత త్వరగా అన్ని వైపులకు చేరి మలినమును పోగొట్టి, ఉపరితలమును స్వచ్ఛముగా, తేటగా చేస్తుందో మీరే చూడండి.




బినాకా టాప్ ...సంపూర్ణ నోటి రక్షణ యొక్క రహస్యము

mcm/ciba/150a/t

వ్యాండా

'ఎక్స్‌ప్లెయిన్ యిట్ టుమై మిసెస్' అన్నాను. మాధవి వులిక్కి పడటం గమనించక పోలేదు. అయినా చెయ్యనట్టే హెచ్చరించాను.

కల్పన ముఖం కత్తివాటుకికూడ రక్తం చిమ్మనట్లు నల్లగా అయిపోయింది. ఏం మాట్లాడలేక నిరుత్సాహంగా చూస్తూ నిరాశగా నవ్వింది.

'ఏమిటిబావా...నువ్వు నీ మాటలూను' కోపంగా బెదిరించింది.

'ఏం తప్పుగా అన్నానా ... నువ్వు నా కాబోయేపెళ్లానివికాదా? నేను నీ మొ...?

'ఛీ...ఎవరయినా వింటే నవ్వుతారని కూడా లేదు...యింతమంది జనంలో ఏం మాటలవి?' నా చెవిలో చీవాట్లు పెట్టింది.

'సారీ మాడమ్' అంటూ ముందుకు నడిచాను.

డొమెటిక్ కార్పంకిల్ దగ్గర దిగాలుగా సంధ్య కూర్చుని వుంది. నన్ను చూడగానే తిరిగి నవ్వలేక నవ్వింది.

# మరువలేని కథ!

'చెప్పండి' అన్నాను. చెప్పలేక ఏవో రెండు ముక్కలు చెప్పింది.

'థాంక్స్' అని నవ్వుతూ ముందుకు నడిచాను.

'మధు' ఆవిడ పిలిచింది. మాధవి ముందుకు వెళ్ళిపోయింది.

'మద్రాస్ నుండి ఏం తీసుకు రమ్మంటారు?' ఆమె కళ్ళలో కన్నీరు తిరగటం గమనించక పోలేదు.

'మీ యిష్టం...'ఏమనాలో తెలియక జాలిగా అన్నాను.

'కాని నేను తీసుకువచ్చి యిద్దామనుకున్నది మీరు తీసుకోరుగా ... అయ్‌హేవ్ లాస్ట్‌ది వేల్యుబుల్ థింగ్' అంది గంభీరంగా.

'ఏం విందుకలా అనుకుంటున్నారు'' యెదురుప్రశ్న వేశాను.

'మాధవీ...ఆ జ్ లక్కీ...విష్ యు వెరీవెరీ హేపీలైఫ్' అంది మాటలు మ్రింగుతూ. అప్పటికిగాని సంధ్యభావం అర్థం కాలేదు.

నా మనస్సు కలుక్కుమంది. ఛీ! ఛీ! తెలిసి తెలిసి నేను పొరపాటు చేశానేమో ననిపించింది.

సంధ్య మనస్సుని అనవసరంగా గాయపరచానేమో ననిపించింది.

ఆమె నన్ను ప్రేమించిందా...ఛీ! ఛీ! ఎంతపని జరిగింది...అలా నేను ఎప్పుడయినా ప్రవర్తించానా? నా చనువే ఆమెకు అలాంటి సద్భావ్యం కలిగించిందేమో? పాపం ఆమె చిగురించే మనస్సు ఎన్ని ఆశలు పడిందో...ఎన్ని స్వప్నాలు ఊహించుకుందో...ఆ విషయంలో ఆమెకు నేను కృతఘ్నుడినే అయ్యాను. అంతే, అంతకంటె నేను చెయ్యగలది ఏముంది?

జనాలు రద్దీగా రావటం చూసి సంధ్యకు చివరి మాటలు చెప్పాను —

'సంధ్య...నావలన మీకు ఏ విషయంలోనయినా బాధ కలిగితే అయామ్ వెరీ వెరీ సారీ...నా ఆవేశానికి క్షమాపణలు అడగటానికి సంశయించను...ఓకే... విష్ యు హేపీ జర్నీటు మెడ్రాస్...గుడ్ నైట్'

ఒక్కక్షణంకూడ నిలబడకుండా బయటకు వచ్చేశాను. బాధతో కృంగిపోతున్న సంధ్య మనస్సులోని వెక్కిళ్ళు నాకు వినిపిస్తున్నాయి. కాని మాధవి చిరునవ్వులు చాలా విలువైనవిగా నన్ను జయించాయి.

జరగరానిది ఒక కథగా జరిగిపోయినందుకు, అందుకు మూలం నేను అయినందుకు నా మనస్సు పశ్చాత్తాపంతో ఒక్కసారి నిట్టూర్చింది...నిజంగా ఆడదాన్ని అర్థం చేసుకోవటం చాలా భయంకరమైన విషయం అనిపించింది.

ఈ సంధ్యా కల్పన నా జీవితంలో, నా మెత్తని మనస్సులో ఒక మరువరాని కథగా మరపురాని కథగా నిలచిపోవటంలో సందేహం లేదు! మాధవి కారు నడుపుతుంది. ఒక్కొక్కసారి ఈ ప్రయాణం ఎంత విచిత్రంగా వుంటుంది?. జరిగినదంతా ఒక కథలా...సినిమాలా జరిగిపోయింది. ఆట అయిపోయిన తరువాత యింటికి వెళ్ళిపోతున్నట్లు వచ్చేస్తున్నాం ... ఈ ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళినా ఆ సంఘటన మర్చిపోలేనేమో ?. అది నాకు ఒక మరువలేని కథగానే వుంటుంది...? ●



# లవ్ లెటర్

బొమ్మల కథ సీరియల్-6

శంకర్ కుమార్




ఆ మాటతో ఒక్క దూకులో ఈ లోకంలో పడిన రాంబాబు చకచకా తన మేకప్ కార్యక్రమాన్ని పూర్తిచేశాడు! శకునం గట్రా చూసుకుని ఎనిమిదింబావుకే బస్టాప్‌కి బయల్దేరారిద్దరూ!
























**పి, వి. ఆర్, రాజాం**

స్త్రీకి అందాన్నిచ్చే కళ ఏమిటో?

మాట నేర్పు.

యౌవ్వనం ఒక కష్టతరమైన సాగరం అంటారు కదా మరి ఆ సాగరాన్ని దాటే శక్తి సాధించే ధీశక్తి ఏవరికన్నా సాధ్యం అవుతుందా అని నా అనుమానం?

నీకా అనుమానం అనవసరం నాయనా, వయస్సు నేర్పుతుంది —ఆ పాఠాలు!

**ఎస్. ఎస్. పి, మద్రాసు**

రచయిత్రిగా మన పత్రికలపై మీకు గల అభిప్రాయం?

ఇన్నిన్ని పత్రికలిదివరకెన్నడూ నేను చూడలేదు. చాలా పత్రికలు రెండో సంచిక రావడం లేదు! ఇక ఇన్నిటికీ— ఆహారం వంచిపెట్టకల సహృదయులున్నారు మన దేశం మొత్తంమీద. . . . . కాని మందు ఎక్కువ అయితే మజ్జిగ పల్చన అన్న సామెత నిజమైపోతూంది. కొన్ని పత్రికలు మొదట్నుంచి చివరివరకూ సోసోగానే ఉంటున్నాయి.

**జి. ఎల్, ముండ్లపాడు**

నేను లోపలి ప్రేమని పైకి మాటలతో చెప్పటంలేదు. పైగా వారియెడనే కొద్దిగా కటువుగా ఉంటాను. దానిని వారు అపార్థం చేసుకొని, నేను లేకపోతే నీవు ఎన్నిరోజులైనా ఉండకలవు అంటూ దెప్పుతారు ... నాకు బాధగా ఉంటుంది.

అంతేకాని అనవసరంగా ప్రేమను మనస్సులో దాచుకుని పైకి భర్తతో కటువుగా ప్రవర్తిస్తే— అది వారికి బాధగా ఉండదన్నమాట!. . . . ఆడవాళ్లతో వచ్చిన చిక్కే ఇది. కారణం తామే అయి వుండీ ఫలితానికి ఎదుటివారిని నిందిస్తారు. సొంత భర్తే కదా కొంచెం ప్రేమ చూపిస్తే మీ సొమ్మేం పోయింది? సంసారంలో ఆడదానికి సెక్యూరిటీ— ఇల్లూ, భర్త సంపాదనా, నగానట్రా. అలాగే మగవాడికేమిటి సెక్యూరిటీ— భార్యప్రేమే కదా? ఈ మాత్రం గ్రహించలేరా?

**జ్వాలాశ్రీ, కర్నూలు**

రామలక్ష్మిగరూ, మీ మొదటి రెండక్షరాలలో పవిత్ర దైవనామం ఉంది. మిగిలిన రెండక్షరాలలో లక్ష్మి ఉంది. మీవద్ద భక్తి ధనం ఉన్నాయా?

రక్షించి గట్టిగా కళ్ళెత్తి చూడకు జ్వాలాశ్రీ! రెండూ మాయం అవుతాయేమో!

**ఎం. పి ఎస్, మొగలవల్లి**

అన్నిటికంటే వాడి అయినది పదునైనది ఏది?

ఆడవారి నాలుక!




**ఎస్. జె. ఎల్, సి. వి. ఎస్. ఎస్, సునాబేడ**

ఈ శీర్షికలో కొంతమంది ప్రశ్నలు చదువుతూంటే ఒక సందేహం ఏర్పడుతోంది. వారికి మీతో పత్రికాముఖాన జవాబు చెప్పించుకోవాలనా? లేక ప్రశ్నలు శీర్షికలో పడాలనా?

అదే విధంగా మీ ప్రశ్ననీ నేను జమకట్టవచ్చు. కాని— ఈ శీర్షిక సరదాగా గివ్—అండ్ టేక్ పద్ధతిలో సాగిస్తున్నాను. అంతేకాని నేనేదో కొమ్ములు తిరిగిన సాహితీపరురాలననీ కాదు, నాకు తెలియనిది లేదనీ కాదు. నేనేం చెప్తానో చూద్దామని అడుగుతారు మీరు. మీ కెలా చెప్తే బాగుంటుందని చూస్తాను నేను! అంతే.

**కె. ఎస్, ఆర్, జెమ్‌షెడ్‌పూరు**

ఇంతకీ మీరు ఇంట్లో తెలుగు మాట్లాడుతారా? లేక ఆంధ్రమా?

రెండూ కాదు. ఎనభై శాతం ఇంగ్లీషు. పదిశాతం అరవం. ఐదు శాతం తెలుగు. వో అయిదు శాతం ఏక్షన్!

**ఎస్. ఎస్. కె, అంగలూరు**

పరిస్థితి అనుకూలించుటకు ప్రయత్నాలు అవసరము. ప్రయత్నించుటకు పరిస్థితులు అవసరమా?

పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడు ప్రయత్నాలు ఫలిస్తాయి. లేకుంటే ఏటికి ఎదురీతే కదా!

**బి. ఎస్. ఆ, తిరుపతి**

మాకు స్వేచ్ఛలేదు మొర్రో అంటున్నారే గాని ఇచ్చిన స్వేచ్ఛను ఎంతమంది స్త్రీలు సద్వినియోగం చేస్తున్నారో చెప్పండి?

పెంపుడు కుక్కని కాస్సేపు తిరగాలని వదలినట్టు వదలడం స్వేచ్ఛ అంటున్నారా మీరు? లేక ఇంట్లో మనిషిని మనిషిగా చూస్తూ వ్యక్తిగత అభిరుచులకీ అలవాట్లకీ విలువనిస్తూ సమాన దృష్టితో చూడడం స్వేచ్ఛ అంటారా? ... మా పక్కింటి మామ్మ అంటూంటారు 'ఆ వెలియిలో విట్టినో యిల్లయో ఇక పేశాదే నాలు మానం కడి' అంటారు మామిని. అంటే 'ఈ రోజు గడపదాటనిచ్చానుగా యింక నోరుమూసుకుని నాలుగు నెల్లు పడుండు' అని! అదామెకు స్వేచ్ఛనిచ్చి ఆదరించినట్టని మీరు తలపోస్తే — మె గాడ్ హెల్ప్ యూ!

**ఎస్. ఎస్. ఆర్, హైదరాబాదు**

ప్రేమించి పెండ్లి చేసుకోవాలా? పెండ్లి చేసుకొని ప్రేమించాలా?

ఎలా అయినా కట్టుకున్నదాన్ని ప్రేమించక తప్పదు!

**బి. పి ఆర్. మహబూబ్‌నగరు**

అక్కయ్యగారూ నేటి ఆధునిక సమాజంలో స్త్రీ నిర్వహించవలసిన పాత్ర ఎలాంటిది?

సమాజంలో పాత్ర సంగతి ఆట్టే తెలియదుగాని, సాటి స్త్రీలతో సమానంగా తిరగాలంటే— స్త్రీలు పాత్రలు తప్పవు!

**పి. ఆర్. ఆర్, ఉండ్రాజవరం**

'సానుభూతి చూపడం, విచారించడం, దయ చూపడం లాంటివన్నీ మనిషి నరాల బలహీనత వల్లనే ఏర్పడతాయి' గోపీచంద్‌గారి ఈ నమ్మలేని నిజాన్ని మీరు సమర్థించుతారా?

కీ. శే. గోపీచంద్ వంటి మహా రచయిత ఇటువంటి వాక్యాలు రాసినా— వాటిని మన మీద రుద్దలేదు. అవి తాను నమ్మినవన్నారంతే. . . . ఇవన్నీ నరాల బలహీనత లక్షణాలైతే— గొంతులు తెగవరకడం, తగలబెట్టడం, మాటలతో కాల్చడం వంటివన్నీ ధైర్యచిహ్నాలని చెప్పుకోవలసి వస్తుంది కదూ?

**జి. పి, తణుకు**

స్త్రీకి చదువు ముఖ్యమా! పని ముఖ్యమా?

చదువుకునే రోజుల్లో చదువు. పని చేసుకోవలసిన సమయానికి— ఎవరూ చెప్పకుండానే తెలుస్తుంది పని.

**ఎస్. వి. ఆర్. ఆర్, కొల్లాపూరు**

హాయిగా కాలాన్ని వెళ్ళించేవారిని చూసి మీకేమనిపిస్తుంది? (అంటే ఐడిల్‌గా, సోమరితనంగా...

ఆహా! వారూ నాలాగే ఉన్నారే అనిపిస్తుంది.

**ఎస్. ఏ. ఆర్, తాడేపల్లిగూడెం**

ప్రేమించి పెళ్ళాడ్డం మేలా? లేక పెళ్ళాడి ప్రేమించుట మేలా?

పెళ్ళాడి ప్రేమించుటయే మేలు— ప్రేమించి పెళ్లిచేసుకోకుండా ఉండాలనుకుంటే! ఏమంటారు?

●

# మూర్ఛరోగులకి సదవకాశం

## హెచ్. ఎమ్. కామత్

ఒక రకమయిన మూర్ఛరోగాన్ని 'ఎపిలెప్సీ' అంటారు ఇంగ్లీషులో. కాళ్ళూ చేతులూ గిలగిల కొట్టుకోవటం, నురుగులు కక్కటం, స్పృహ కోల్పోవటం మొదలగునవి ఈ వ్యాధి లక్షణాలలో కొన్ని. ఇది ఎందరికో ఉంటుంది.

దీని కారణాలు ఏమిటో సరిగ్గా తెలియదు కాని మెదడులో కొన్ని భాగాలలో విద్యుత్ ప్రసారము కలిగి, కృత్రిమమయిన ఉద్రిక్తపరిస్థితి ఏర్పడి, పయిన చెప్పిన రోగ లక్షణాలు కనిపిస్తాయని మొత్తంమీద అందరూ ఊహిస్తున్నారు.

ఈ 'రోగం' ఉన్నవారిలో కొందరు సుప్రసిద్ధులు—హెర్క్యులెస్, సోక్రెటిస్, జూలియస్ సీజార్, అయిదవ ఛార్లెస్ చక్రవర్తి...

మూర్ఛకి చిట్కా చికిత్సలు ఎన్నో ఉన్నాయి కాని చాలాకాలంగా మత్తుమందు వాడడమే ప్రథమ చికిత్సగా ఉండేది. 1938 లో డా. ట్రేసీ జాక్సన్ — ప్యుట్నమ్ అనే ఆయన డయిలాంటిన్ సోడియమ్ అనే మందును కనిపెట్టాడు. 1919లో ఆయనకి 75000 డాలర్ల బహుమతికూడా లభించింది. అయితే ఈ రకం మందులవల్ల గుణం కనిపించినా ఇతరబాధలు ఎన్నో ఏర్పడుతూ ఉంటాయి.

1967 లో భారతదేశంలో డాక్టరు వినాయకరావు బాపత్ అనే ఆయన 'తంతుపాశన్' అనే మందు కనిపెట్టారు. ఇందులో మిరియాలవంటి దేశీయ వస్తువులు ఎన్నోఉన్నాయి. తంతు పాశన్ వల్ల 100 కి 41.3 మందికి మంచిగుణం లభించిందిట. పరిశోధనలు ప్రయోగాలు ఇంకా జరుగుతూ ఉన్నాయి.

ఇతరదేశాలలో మూర్ఛరోగులకు సహాయంచేసే సంస్థలు ఎన్నో ఉన్నాయి. ఈరోగం చికిత్సకోసం ఎంతో పరిశోధన జరుగుతోంది. భారతదేశంలో ఇంత శ్రద్ధ చూపబడటంలేదనే చెప్పాలి. డా. బాపత్ మాత్రం మూర్ఛరోగులకి సహాయపడే సహకారసంస్థ ఒకటి స్థాపించే పథకం తయారుచేశారు. వారి పథకం ప్రకారం ఒక రోగికి రోజుకి మందులకోసం 25 పయిసలకన్నా ఎక్కువ ఖర్చు అవదు.

ఇంకా వివరాలు కావలసినవారు ఈకింది చిరునామాకి డా. బాపత్‌కే నేరుగా రాయవచ్చు —

(డా. వినాయకరావు బాపత్)
389 –A లామింగ్‌టన్ రోడ్
(Lamington Road
బొంబాయి—4






**జరిగిన కథ**

**స్వామికి స్కూల్లో టీచరు ఉద్యోగంతోపాటు రఘుపతిగారింట్లో ఆశ్రయంకూడా దొరకటంతో అదృష్టవంతుడిని అనుకున్నాడు. అయితే రఘుపతి గారమ్మాయి పావనికి ప్రైవేటు చెప్పాల్సి వచ్చే టప్పటికి అతడికి వచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్లయింది. పావని గడుగ్గాయి. ఏప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ వుండే ఆ అమ్మాయి స్వామికి కాస్త ఇబ్బందిగానే తయారయ్యింది. పావనికి సంబంధాలు వస్తున్నాయి పోతున్నాయి. ఒకటీ కుదరడం లేదు. తల్లి రాయించిన ఉత్తరంతో స్వామి మనసు వద్దన్నా పావనిపై మోజు పడుతోంది. స్వామి స్కూల్లో సాటివాళ్ల కామెంట్లు భరించ లేకుండా వున్నాయి.**

## 11

ఈ విషయంలో మర్నాటి ఉదయం మరొక యుద్ధం జరిగింది తల్లీకొడుకుల మధ్య.

'ఆ తండ్రిపోలికే నీకూ వచ్చిందే. మింగ మెతుకు లేదు—అని ఏదో సామెత చెప్పినట్లు—మన మేమన్నా లక్షాధికార్లమిటే—అంతా అయ్యాక-రోజులు గడిచే మార్గమేమిటా అని నేను బెంగపెట్టుకు ఛస్తుంటే—'

మాటమీద మాట పెరిగింది. సీతమ్మగారు వంట చేసుకుంటూ బయటకు రాలేదు అంతా వింటున్నా. కలిసి కాపురం పెట్టిన నాటినుంచి యింటి విషయం రఘుపతిగారు పట్టించుకోవడం లేదనీ—అలవి కాని సంసారపోషణ భారం స్వామిమీద పడిందనీ స్వామి నోటితో చెప్పకపోయినా—సీతమ్మగారు గ్రహించింది. అంతకు ముందు రెండురోజుల క్రితం వచ్చిన మనియార్డరు స్వామి తీసుకున్న తర్వాత—

'ఎక్కడనుంచి వచ్చిందిరా డబ్బు స్వాములూ?' అని అడిగింది.

'ఆనందం పంపాడమ్మా'

'నువ్వు పంపమన్నావా?'

'ఔను'

'ఎంతని అప్పు తేగలవురా? ఈ పద్ధతి నాకంత నచ్చలేదు'

విసుక్కొన్నాడు స్వామి.

తల్లిబాధ కొడుకు అర్థం చేసుకున్నా, కొడుకు వ్యథను తల్లి పోల్చుకున్నా, చేయగలిగిందీ చేయవలసిందీ ఏమిటో యిద్దరికీ అర్థం కాలేదు.

పరాంకుశంగారి మాటలు స్వామిని యింతగా బాధించడానికి—అంతకు ముందు జరిగిన ఈ సంఘటనలన్నీ చాలా వరకు కారణం. పావనికి చీరకొని యివ్వగల శక్తి తనకు ఈ నెలలో లేదు. ఆనందం పంపిన వందలో యింకా పాతిక మిగిలింది. నెలలో యింకా పదిరోజులు గడవాలి. సీతమ్మగారికి లేహ్యం కొందామనుకున్నాడు. కుదరనే లేదు. ఆ పరిస్థితులే స్వామికి ఊరట కలిగిస్తున్న విషయం ఒక్కటే. తల్లికీ అత్తగారికీ మధ్య కుదిరిన సయోధ్యత.

ఆనందం పంపిన డబ్బులో మిగిలిందంతో చూసుకొని—అందులో పదిరూపాయలు పెట్టి ఒక చీరాల నేతచీర కొన్నాడు. పెళ్లి అయింతర్వాత—భార్యకోసం తాను కొన్న మొదటి చీర. స్వయంగా యివ్వడానికి సిగ్గనిపించింది. ముందు కనిపించిన తల్లికి చూపెట్టాడు.

మడతవిప్పి చూసి 'ఈ వంగరంగు దాని వంటికి ఎంతో బావుంటుందిరా' అంటూ సంబరపడిపోతూ చక చక అంగలు వేసుకుంటూ 'పావనమ్మా' అని కేక పెడుతూ—కోడలిని వెతుక్కుంటూ యింట్లోకి నడిచింది సీతమ్మగారు.

'పావనికి నచ్చిందో లేదో నా సెలక్షను!'—మళ్లీ అనుమానం వచ్చింది స్వామికి. మిగిలినడబ్బు—తెలిసినా ఎంతుందో—మరొకసారి లెక్క చూసుకొని, ట్రంకులో పంచ మడతలో దాచి—నెత్తిన రెండువాదలు గుమ్మరించుకు రావడానికి దొడ్లో బావిదగ్గరకు నడిచాడు స్వామి.

బాదం చెట్టుక్రింద పడుకున్న సీతమ్మగారు వస్తున్న కొడుకును చూసి—కళ్లు తుడుచుకుంటూ లేచి కూర్చుంది.

'ఏం జరిగిందమ్మా ?'

'ఏం లేదురా—'

'ఎందుకలా ఉన్నావ్ ?'

'ఎలా ఉన్నానురా ? కాస్త పడిశం పట్టిందంతే' లేచి బావిదగ్గరకు నడుస్తూ బరువుగా నిట్టూర్చాడు స్వామి.

* * *

మరొక పదిరోజులుంటుందనుకున్న సీతమ్మగారు — వెళ్లితీరాలంటూ పట్టుబట్టి మర్నాడు నూజివీడు వెళ్లిపోయింది.

'ఎప్పటికైనా నీ చేతులమీదుగా వెళ్లిపోవలసిందేరా ఈ జీవితం. నేనుమాత్రం మరెక్కడుంటాను చెప్పు. ఇంకా రెక్కల్లో శక్తి సాంతం ఉడిగిపోలేదుగదా? నీ సంపాదనమాత్రం ఏమంతని? కొన్నాళ్ళు పోనీ. మరొకలా బాధపడకు. అవధానిగారి కూతురు పెళ్లికానీ—ఆనక చూద్దాం' అంటూ ఆమె ఎన్నిరకాలుగా చెప్పినా—స్వామికి తృప్తి కలిగింది కాదు.

ఆ ఊళ్లో—ఆ యింట్లో ఎక్కువ కాలం వుండటం కష్టమనిపించింది. పావని—ఆ పుట్టినరోజు తల్లితో పెద్ద పోట్లాట కాక—మాసినచీర కట్టుకొని ముణగదీసుకు పడుకుంది. రఘుపతిగారు



—యింటి పట్టున కనిపించకుండా — బ్యాంకు ప్రసిడెంటుగిరీనుంచి కోనేటి రావును తొలగించాలని మహాయజ్ఞం చేస్తూ హైదరాబాద్ చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. అంతకుమించి పంచాయితీ ప్రసిడెంటుగా పోటీ చేస్తున్న కోనేటిరావును వోడించితీరాలని పట్టుదల. ఆనందం పంపిన వందరూపాయలూ హారతి కర్పూరంలా హరించుకుపోయింది. పావని ఆశలూ ఆలోచనలూ—తనకున్న శక్తినిమించి పరుగులు తీస్తున్నాయని పించింది. మరొక ఊరికి బదిలీ చేయించుకోవాలనే ఆలోచన వచ్చింది. ఈ విషయం పావనికి చెప్పాలనుకుంటూనే మరొకవారం రోజులు గడిపాడు. ఒకనాడు పావనే అంది. ఈ పాడుకొంపనుంచి — దిక్కుమాలిన ఊరినుంచీ బయటపడితేనేగానీ మనకు సుఖం లేదండీ' అంటూ.

'నాకూ అలాగే అనిపిస్తున్నది—కానీ...'

ఇద్దరూ ఆలోచనల్లో మునిగి పోయారు.

ఊహ వేరు. అనుభవం వేరు. ఒకవిషయం —స్వయంగా అనుభవించకుండా దాని స్వరూప స్వభావాలను ఎవరూ ఖచ్చితంగా జేరిజు వేయలేరు.

ప్రతి జీవితానికీ ఎక్కడో పునాది వుంటుంది. అది కదిలిపోవడమంటే ఏమిటో—స్వానుభవం మీద మాత్రమే మనిషి తెలుసుకోగలడు. పునాది అణుమాత్రం కదలగానే, ఎంతటి సౌధమైనా కంపించి పోవడం జరుగుతుంది.

స్వామికి అలాటి అనుభవం ఎదురవుతున్నట్లనిపిస్తున్నది. ప్రతి చిన్న చిరుగాలికీ కంపించి, బ్రతుకంతా తలక్రిందులయిందని బాధపడే మనుష్యులూ వుంటారు. అది అనుభవిస్తున్న కష్టం యొక్క తీవ్రత కాదు. మనస్సులో దాగిన దుర్బలత్వం. కాని స్వామి పరిస్థితి వేరు. వివాహం జరిగింతర్వాత మొదటి పుట్టిన రోజు పండుగ పావని ఎలా గడిపిందో మరిచిపోలేకపోతున్నాడు స్వామి.

'అంతకంటె డబ్బు లేకపోయింది. ఆ చీర ఎందుకు కట్టుకోలేదు పావనీ' అన్నాడు అనునయిస్తూనే ఆరాత్రి.

మాట్లాడలేదు పావని. దగ్గర మంచం మీద కూర్చొని మళ్లీ దీనంగా 'కోపం వచ్చిందా పావనీ? నాకీ వూళ్లో అప్పు మాత్రం ఎవరిస్తారు చెప్పు? ఇచ్చినా దానిని తీర్చేమార్గం ఎక్కడుంది నాకు? అర్థంచేసుకోలేవా ఆమాత్రం నా మనస్సు. గడియారం కూడా పోయింది. ఉంటే అది అమ్మి అయినా నీకు మంచి జరీ చీర కొని పెట్టేవాణ్ణి' అన్నాడు.

పావని చాలాసేపు మాట్లాడలేదు.

'నన్ను క్షమించు పావనీ—కోపం పోదంటావా నీకు?'

ఏడ్చింది.

'కోపం లేదండీ మీమీద. మీరు మాత్రం ఏంచేస్తారు? లేని అదృష్టాలు రమ్మంటే ఎక్కడనుంచి వస్తాయి? కాని—చెప్పండి.'

'ఏమిటి?'

'ఈ వూరునుంచి బయటపడేమార్గం ఆలోచించండి.'

చేతుల్లో భర్తచెయ్యి తీసుకుంటూ అడిగింది.

ఆమె చెయ్యి కాలుతున్నది.

'నీకు జ్వరం తగిలింది పావనీ నువ్విలా వుంటే...నాకేదో భయంగా వుంది'

'ఉండనులెండి యిలా యింకెప్పుడూ'

'ముందు ముందు—అదృష్టం కలిసి వచ్చి—నాకు నాలుగు ట్యూషన్లు దొరికితే—నీకు ఎన్నిచీరలు కొనిపెట్టలేను ?'

జాలిగా నవ్వింది పావని.

తేలికగా నిట్టూర్చాడు స్వామి.

'మనకు రోజులు మారవంటావా పావనీ ?'

'తప్పకుండా నండీ'

ఆశలు పెంచుకుంటానికి ఆధారం వున్నా లేకపోయినా ఆశ అనేది సాధారణంగా మనిషని విడిచిపోదు. విడిచిపోతే మనిషికి జీవితమే లేదేమో. నిజానికి తమ రోజులు మారగలవనే నమ్మకం పావనికి ఏమాత్రం లేదు. భారతి—ఆలివేణి - ఇద్దరూ తనతో పాటు పుట్టి పెరిగినవాళ్లే. పెళ్లి విషయం ఆలోచించేవారకూ—అదృష్టాల నిచ్చెనమీద తలొకమెట్టుమీదనూ నిలబడిన తమ జీవితాలమధ్యగల—దూరాలను పావని గుర్తుపట్టలేదు. ఈ నాడు వద్దనుకున్నా— ఆ దూరాలరహస్యం—తాను గుర్తింపకుండా ఉండలేకపోతున్నది.

మర్నాడుకూడా లేవలేకపోయింది పావని. డాక్టరుని పిలుచుకొచ్చాడు స్వామి.

వూళ్లో జ్వరం.

వళ్లంతా నొప్పులంటూ మూలుగుతూంది. ఆనందం పంపిన డబ్బు యింకా మిగిలింది గనుక సరిపోయింది. కాకపోతే యింజక్షన్సు కొనడానికి—చివరకు ఏ పరాంకుశాన్నో—విధిలేక అప్పు అడగవలసివచ్చేది. నాలుగురోజులకుగానీ జ్వరం తగ్గిందికాదు. నెలరోజులు లంఖణాలు చేసినట్లు నీరసించిన పావని చెక్కిళ్లు పల్చబడి పాలిపోయినట్లు కనిపిస్తున్నాయి. టానిక్కులు వాడమన్నాడు డాక్టరు చీటీ యిచ్చి.

'దీని తస్సాదియ్యా! వూళ్లోజ్వరం మనిషిని మహానీరస పెడుతుంది. బాగా టానిక్కులు వాడు తమ్ముడూ' అంటూ సలహా చెప్పాడు పరాంకుశం గూడా. రకరకాల ఆపేక్షలు మనుష్యులకు. 'డబ్బు లేదని అశ్రద్ధ చేయబోకు. నా దగ్గరుంది. మొహమాటపడకు. మనలో మనం సర్దుకోకపోతే యెలా ?' అంటూ అప్పు



యంగా ఫిర్యాదు చేశాడు పరాంకుశం. అంత అవసరంలోనూ ఆయనదగ్గర సహాయం అందుకోవాలనిపించలేదు.

'మంచి టానిక్కులు బాగా పడాలి మాష్టారూ!' అంది భారతికూడా పావని దగ్గర కూర్చున్నది లేస్తూ తాను రాగానే. భారతి అత్తవారి ఊరు మరీ అంత దగ్గరలో వుండటం సుఖమనిపించలేదు స్వామికి. సగానికి సగంరోజులు అన్నగారింట్లోనే మకాం ఆమెకు.

'అపశకునం' అంటూ గొణిగాడు భారతి వెళ్ళింతర్వాత పావని దగ్గర కూర్చుంటూ స్వామి.

'ఏమిటండీ?' అంది పావని గొంతు బావిలోంచిలా.

'పుట్టినరోజు పండక్కి నే తెచ్చిన చీర కట్టుకోక పోవడం'

'పొరపాటయిందండీ' మరచిపోరన్న మాట ఆ మాట మీరు?'

'నా దురదృష్టం.'

'కాదు. రేపు కట్టుకుంటా' జాలిగా అంది పావని.

తనమీద తనకే వల్లమాలిన జాలి పుట్టుకొచ్చింది స్వామికి. తన అసమర్థత తనను వెక్కిరించింది. తల్లికోసమే బ్రతుకుతున్నా ననుకుంటూ యింతకాలం ఊపిరి పీల్చాడు, రెండునెలల క్రితందాకా. ఇంత స్వల్పవ్యవధిలో తనకు వివాహం కావడం, జీవితంలో అంతకుముందెన్నడూ ఎరుగనివ్యక్తి తన జీవితాన్ని పంచుకొని, తన బ్రతుకులో భాగమైపోవడం, ఆలోచించినకొద్దీ చిత్ర మనిపించింది.

'అమ్మో'— గొణుక్కుంటున్నట్లు మాటలువచ్చాయి అప్రయత్నంగా పెదిమల మీదనుండి. తాను చేస్తున్నది మోసమనిపించింది. కాదు. కాదు. తన దురదృష్టం తనని మోసం చేస్తున్నది. తనకంటె లోకంలో కనిపించిన ప్రతి మనిషీ సమర్థు డనిపించింది. తనమీద తనకే కోపంవచ్చింది. ఎంతకోపంవచ్చినా, తోటి 'బడిపంతులు' పరాంకుశాన్ని గూడా ఏమీ చేయలేక పోయాడు తాను. తాత తండ్రులు సంపాదించిన ఆస్తులున్న అదృష్టవంతులు, వందలూ వేలూ గుమ్మరించుకుని—మున్సబుగారి అరుగులమీద పేకాడుతూ కులాసాగా కాలక్షేపం చేయడం చూసినప్పుడల్లా—వాళ్ళుచేసిన పుణ్యమేమిటో తాను చేసిన పాపమేమిటో అర్థంకాలేదు. హోంవర్కు చెయ్యలేదని కోనేటిరావు తమ్ముణ్ణి రెండు మొట్టికాయలు మొట్టినందుకు—పదిమందిలో 'పంతులూ! నీ పిలక పీకిస్తా జాగ్రత్త!' అంటూ గర్జించి అవమానించినప్పుడు గూడా 'క్షమించండి' అనేమాటగాక మరో శబ్దం తన గొంతులోంచి ఊడిపడలేదు. రఘుపతి గారికి ఈ సంగతి తెలిసిగూడా, మౌనం వహించారు.

అంతే కాదు.

ఈ సంఘటన జరిగిన మరునాడే రఘుపతిగారూ కోనేటిరావూ రాజీపడటం జరిగింది!. 'మన పంచాయితీకి మన కోనేటిరావునే ప్రసిడెంటు చేయాలి' అంటూ రఘుపతిగారు, మున్సబుమీద కక్షగట్టి, వీధులన్నీతిరిగి అయినవాళ్ళందరికీ చెప్పిరావడం—తనకే చిత్రమనిపించింది. ఈ తాలూకు రాజకీయ పరిజ్ఞానం స్వామికి రవ్వంతకూడా లేదు నిజానికి. ఊరి రాజకీయాలలో కొంత ప్రశాంతత ఏర్పడింది. తరచుగా కోనేటిరావు రఘుపతి యింటికి రావడం—వాళ్ళు జీవికా జీవులై—గంటలతరబడి మాట్లాడుకుంటూ కాలక్షేపం చేయడం జరుగుతూంది.

రఘుపతిగారి వ్యక్తిత్వంమీద గల నమ్మకం—ఆ యింట్లో జేరినప్పటినుంచి క్రమక్రమంగా దిగజారుతూనే వచ్చింది. చిల్లరకొట్టు వీరాస్వామి చేతిన మెరుస్తున్న గడియారం చూసి ఉలిక్కిపడ్డాడు స్వామి అదేరోజు. దానికేసి పరికిస్తూ నిలబడిపోయాడు వెచ్చాలసంగతి మరిచిపోయి కొయ్యబారి.

'ఏం కావాలి మాష్టారూ?' అన్నాడు వీరాస్వామి.

'ఆ గడియారం—' అప్రయత్నంగా వెలువడుతున్న మాట విరిగింది.

'అదా! మందేలెండి'

'కొన్నావా కొత్తగా.'

'అదే కొనడం లెండి. మీలాంటి పెద్దమనుషులే — అవసరానికి తాకట్టుపెట్టి వంద రూపాయలు అప్పు తీసుకెళ్ళారు మూడునెల్ల క్రితం. ఇన్నాళ్ళు గడిచినా— ఆ పెద్దమనిషి డబ్బు యివ్వడంగానీ— గడియారం విడిపించుకుపోవడంగానీ జరగలేదు. అసలింతకీ యిది వందరూపాయలుంటుందంటారా మాష్టారూ? నాకు అనుమానంగా వుంది?' అంటూ పంచకు చేతులు రుద్ది తుడుచుకొని గడియారం తీసి స్వామికిచ్చాడు వీరాస్వామి.

కోటిమందిలో చూసినా, బిడ్డ తల్లిని గుర్తుపట్టగలదు. స్వామి అనుమానం నిజమయింది. అది తన గడియారం. పరీక్షగా చూశాడు. తనదే. కీ యిస్తున్న మీట దగ్గర గోడకు రాసుకుని తళుకూడింది. అనుమానం లేదు. తనదే. ఆనందం కట్టించిన లాటరీలో తనకు వచ్చిందే. మళ్ళీ కళ్ళపడుతుందనుకోలేదు.

'ఎంతుంటుందంటారు మాష్టారూ?'

'ఎవరు పెట్టారు దీన్ని నీ దగ్గర?'

'అమ్మ బాబోయ్! అది రహస్యమండోయ్. పెద్దమనుషు లెందరితోనో నాకు లావాదేవీలు. మొగుడికి తెలియకుండా పెళ్ళాలు, పెళ్ళాలకు తెలియకుండా మొగుళ్ళు — తండ్రులకు తెలియకుండా బిడ్డలు, బిడ్డలకు తెలియకుండా తండ్రులు—లక్ష లిటిగేషన్లు లెండి. ఈ రహస్యాలు మా యింటావిడకు గూడా



చెప్పనే. అలా గుట్టు నిలబెట్టినప్పుడే— పదిమంది పెద్దమనుష్యులు మనదగ్గర కొస్తారు. ఇంతకీ ఎంతుందంటారు?'

'దీని విలువ నే నెక్కడ కట్టగలను సేటూ' అంటూ యింటికి నడిచాడు.

ఆనాడు రఘుపతిగారి ముఖం కొత్తగా కనిపించింది. 'ఈ వ్యాజ్యాలు ఈయనకొక వ్యసనమైపోయాయి బాబూ! దావాలంటే అవసరమొస్తే — యింటినీ యిల్లాలినీ గూడా తాకట్టు పెట్టేస్తారు. మా ఖర్మ!' అంటూ కళ్లు తుడుచుకునే శారదమ్మగారి రోదనలోని వేదనకు అర్థం తెలిసింది స్వామికి.

'ఛీ! ఏం మనిషి' అనుకున్నాడు.

అంతకంటె ఆశ్చర్యకరమనిపించిన సంఘటన ఒకటి జరిగింది మూడు రోజుల తర్వాత. రఘుపతిగారు స్వయంగా మెరుస్తున్న ఒక గడియారాన్ని చేతపట్టుకు వచ్చి, 'చూడు బాబూ! ఇది నీదేనేమో' అంటూ స్వామిచేతికిచ్చారు.

'ఎక్కడ దొరికిందండీ యిది?'

'భోషాణం క్రింద బాబూ! చూశావా? దొరికింది గనక సరిపోయింది. లేకపోతే ఈనింద ఎవరిమీదన్నాపడవచ్చుగదా? ఇంట్లో గడియారం ఎలా మాయమైపోయిందీ అని నీకే అనుమానం రావచ్చు. మనిషి మనస్సెంది చూశావ్? ఎటు పరిగెత్తినా పరుగెత్తుతుంది దీని దుంపతెగ. యింతకూ మారోజులు బాగున్నాయి గనక దొరికింది, పొదుంబుర్ర చేతిలోంచి జారీ—అటు పరిగెత్తింది భోషాణం క్రిందకు. వంగిమాద్దును గదా—అక్కడ మిణుగురు పురుగులా మెరుస్తూ కనిపించిందయ్యా యిది.'

గడియారం చూసుకుంటున్న స్వామికి ఈ మాటలేమీ వినిపించలేదు. పోయింది దొరికినందుకే సంబరపడిపోతున్నాడు. టవల్‌తో దాన్ని సుతారంగా తుడిచి ఎన్నాళ్లయిందో. అంతలో రఘుపతిగారు ఒక వందరూపాయల కాగితం తెచ్చి— అల్లుడి చేతిలో పెట్టారు.

'ఏమిటండీ యిది?'

'బట్టలు కొనుక్కో బాబూ! మొన్న పండక్కే తెద్దామనుకున్నా. కాని తీరికలేకపోయింది ఊరిగొడవలతో. కోనేటిరావుతో రాజీపడింతర్వాత రవ్వంత ఊపిరి పీలుస్తున్నాననుకో. మీకంటె నాకుమాత్రం ఎవరున్నారు బాబూ.'

మంచికి చెడ్డకూ మధ్యగల సరిహద్దు లేమిటో అర్థం కాలేదు స్వామికి. చిత్రంగా మామగారి ముఖంలోకి చూశాడు.

'కూర్చో బాబూ! నీకో ముఖ్యవిషయం చెప్పాలి. ఈ బడిపంతులుద్యోగం నువ్వు చెయ్యడం నాకిష్టం లేదయ్యా.'

సుదీర్ఘ చర్చ జరపటానికి సిద్ధపడిన మనిషిలా కుర్చీలో బైఠాయించారు రఘుపతిగారు.

'ఏమిటండీ?'

'చెప్తా! నీకుకాక ఎవరికి చెప్పుకుంటా? ఒక్క రహస్యం—'

'నిజం చెపుతున్నానబ్బాయ్. నేను ఒక విధంగా చూస్తే ఒట్టి అమాయకుణ్ణి. వింటున్నావా? డబ్బు తగలెయ్యడమే తెలుసుకున్నా కానీ—రాగిపైసా సంపాయించడమెలాగో తెలుసుకోలేక పోయాను మొన్నటీవరకూ. నిజంగా నా జీవితంలో —మొన్న ఉన్నది చూశావ్—పర్వదినమనుకో, జ్ఞానోదయంలాంటి దేదో కలిగింది. పంచాయితీ ప్రసిడెంటుగా తనని బలపరిస్తే అయిదువేలిస్తానన్నాడు కోనేటిరావు—రాయబారం అందగానే ముందు మండిపడింది మనస్సు. ఇంత బ్రతుకూ బ్రతికీ — అనిపించింది. కాని సామర్ధ్య యింట్లో పడుతున్న యిబ్బందులు చూశావుగా. ఇన్నాళ్లూ మాట్లాడుతూనే నిద్రపోయే ఆ మున్సబును పట్టుకుని ఏం సాధించాను చెప్పు. నిజానికి సమర్థుడంటే కోనేటిరావయ్యా. కోపం వస్తే వచ్చింది మున్సబుకు. ఏం నన్ను తలగొట్టి మొలేస్తాడా? సరే అన్నా. అన్నమాట ప్రకారం అయిదువేల నోట్లకట్టలూ చేతిలో పెట్టిపోయాడయ్యా—'

'! ! ! ! !'

'అంతేనా? పంచాయితీ కాంట్రాక్టులన్నీ మనకే యిప్పిస్తానన్నాడు. నాకూ—పెద్దముండా వాణ్ణే అయ్యానా — వోపిక చచ్చిపోయింది సుమా—సంపాయించినా ఎవరికోసం? నువ్వు ఉద్యోగం చేస్తున్నా ఏముంది సస చెప్పు. వట్టిపోయిన గేదెను పాలుపితికినట్టే బడిపంతులుద్యోగమంటే. నిక్షేపంగా మానెయ్యి. నాలుగు కాంట్రాక్టులు మంచివి తగిలితే —నువ్వూ అమ్మాయీ—రాజాల్లా బ్రతకొచ్చు. మా కాలం అయిపోయిందనుకో—మరో ఆలోచన పెట్టుకోకు. నోహో! మారేళ్లయ్యా బాబూ కోనేటిరావ్! రా రా! మనంగతే మాట్లాడుతున్నా.'

కాంట్రాక్టుల విషయం వివరంగా మాట్లాడుతున్నా రిద్దరూ.

అయోమయంగా వింటున్నాడు స్వామి.

చెల్లెలు భారతమ్మ మొగుడితో చదువుకున్న అతనెవరో లాకులకి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా వచ్చాట్ట. అంతా మట్టి పనిట. నూటికి నూరు మిగులుతుందట. తన పేరుమీద చేయడం యిష్టం లేదట. పెట్టుబడికి డోకా లేదట. పోయింది పోనూ మిగిలింది చెరిసగంట. సంవత్సరానికి తలో పాతికవేలూ అవలీలగా కళ్లజూడ వచ్చట. 'మాష్టారే' అంతా మేనేజిమెంటట. కాపురం కూడా లాకుల దగ్గర అవసరంలేదట. ఒక జీపు కొంటున్నాడట.

ఆ మాట్లాడుతున్నది పది మందిలో పట్టుకు తన పిలకె జాడిస్తానన్న పెద్దమనిషేనా అనే అనుమానం కలిగింది. కోనేటిరావు చెబుతున్నాడు. రఘుపతిగారు తల పంకిస్తున్నారు. స్వామి గుండెలు భయంతో తందరిస్తున్నాయి. తను సంతకాలు పెట్టమన్నాడు కోనేటిరావు పావుగంట మాట్లాడి ఆగి.

'నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి' జారిపడలా ఆ మాట స్వామి నోట్లోంచి ఠంగున. గొణిగినట్టయింది.

'సిరి రా మోకాలడ్డు పెట్టటమంటే యిదే బాబూ. నిస్సంకోచంగా పెట్టవయ్యా' అంటూ ప్రోత్సహించారు రఘుపతిగారు, అల్లుడి భుజం తట్టి— పెన్ను మూతతీసి చేతికందిస్తూ.

జేబును జేబులోంచి—తనకు కనపడేలా వందరూపాయల నోట్లకట్ట ఒకటి బయటకు తీసి — ఉంచండి పదివేలూ మాష్టారూ' అన్నాడు. కోనేటిరావు ముందున్న టేబిల్‌మీద నిర్లక్ష్యంగా గిరవాటు వేస్తూ.

'పదివేలు! డబ్బే? కరెన్సీ.'

బుద్ధి తెలిసిన తర్వాత అంత డబ్బు ఒక్కసారి చూడలేదు స్వామి. పదివేలు! తనకు బది పది సంవత్సరాల జీతం! ! గుండె దడ హెచ్చింది.

'తొందరగా సంతకాలు కానివ్వండి. ఏలూరెళ్లి దాఖలు చేయాలి'

సంతకం పెట్టాడు స్వామి.

పావని అన్నట్టు నిజంగానే మారింది స్వామి జీవితం. అనుకోని మార్పు! ఆశించని మార్పు! !

(ఇంకా ఉంది)

# తల్లిదండ్రులకు శుభవార్త!

## బిన్నీ బట్టలు స్కూలు యూనిఫారములకు

### ఇప్పుడు విరివిగా లభిస్తున్నాయి!

పిల్లల వస్త్రాములకు బిన్నీ డ్రిల్లులలో కావలసినవి తీసుకోండి; బిన్నీవారి D316 ఆడపిల్లల యూనిఫారములకు, బిన్నీవారి 'కొరొలిన్' పాప్లిన్ పిల్లల షర్టులకు/ఆడపిల్లల బ్లౌజులకు.

స్కూలు అధికారులు శిఫారసు చేస్తారు తల్లి దండ్రులు తమ పిల్లల యూనిఫారములకు బిన్నీ బట్టలను ఉపయోగిస్తారు.

బిన్నీ బట్టలు ఎన్ని ఉతుకులైనా అందంగా ఉండి బాగా మన్నుతాయి—

బిన్నీ డ్రిల్లులు D316, 'కొరొలిన్' పాప్లిన్ షర్టింగులు, అనుమతి పొందిన బిన్నీ స్టాకిస్టులవద్ద సిద్ధంగా దొరుకుతాయి.

మీటరు ఒక్కంటికి చిల్లరధర ఎక్సైజు సుంకంతో కలసి *

సాధారణ డ్రిల్లులు:

| | |
|---|---|
| WB17 (తెలుపు) | రూ. 3.46 |
| B17 C800 (కాకీ) | రూ. 3.58 |
| WB37 (తెలుపు) | రూ. 3.33 |
| B37 C800 (కాకీ) | రూ. 3.53 |

'శాన్‌ఫొరైజ్డ్' & మెర్సిరైజ్డ్ డ్రిల్లులు:

| | |
|---|---|
| WB94 X (తెలుపు) | రూ. 3.35 |
| B94 C800 X (కాకీ) | రూ. 3.98 |
| WB39 X (తెలుపు) | రూ. 3.73 |
| B39 C800 X (కాకీ) | రూ. 3.92 |

'శాన్‌ఫొరైజ్డ్' & మెర్సిరైజ్ డ్రిల్లులు, నేవీబ్లూ ఛాయలలో:

| | |
|---|---|
| B39 BC164 X (నేవీబ్లూ) | రూ. 4.08 |
| D316 (తెలుపు) | రూ. 3.10 |
| D316 (లేత, మధ్యరకపు ఛాయలు) | రూ. 3.53 |
| D316 (ముదర, ఎక్కువ ముదర ఛాయలు) | రూ. 3.77 |

'కొరొలిన్'-'శాన్‌ఫొరైజ్డ్' మరియు మెర్సిరైజ్డ్ పాప్లిన్

| | |
|---|---|
| తెలుపు | రూ. 4.15 |
| రంగు వేసినవి (అన్ని ఛాయలు) | రూ. 4.27 |

* ఈ వెలలు తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, మైసూరు, కేరళ రాష్ట్రములలో మాత్రమే వర్తించును.

పాఠశాలలకు మనవి:

మీ విద్యార్థులకు కావలసిన యూనిఫారమ్ బట్టలు సౌలభ్యంగా దొరకని పక్షంలో దయతో మాకు వ్రాయండి:

బిన్నీ లిమిటెడ్
(బకింగ్‌హామ్ & కర్నాటిక్ మిల్స్) కర్నాటిక్ బ్రాంచ్
పి.ఒ. బాక్సు నం. 958 మద్రాసు-12

# బిన్నీ

*తల్లిదండ్రులు వెచ్చించే సొమ్ముకు మంచి విలువ*

BY-5886




(గత సంచిక తరువాయి)

'ఎలక్ట్రో మీటరు'తో కుస్తీ పడుతున్న నా భుజంమీద తట్టేడు ఏండర్సన్ మాత్స్.

'అందరం వెడుతున్నాం నువ్వు రావా?'

'ఎక్కడికి?'

'హెల్గా స్వేన్సన్ కాఫీకి పిలిచింది కదా?'

'అప్పుడు జ్ఞాపకం వచ్చింది'— దుకాణం కట్టేసి, బ్రీఫ్ కేస్ సర్దుకున్నాను.

ఆవిడ మా లబ్బరేటరీలో గదులు తుడిచి శుభ్రంచేసే మనిషి. వయస్సు దాదాపు 60. ఆవిడ మమ్మల్ని అందరినీ కాఫీకి పిలవడమే నాకు ఆశ్చర్యం కలిగించింది. 'క్రిస్మస్ ముందర ప్రతి యేడూ ఆవిడ మమ్మల్నందర్నీ పిలుస్తూ ఉంటుంది. మేము ఏదో బహుమతి తీసుకు వెడతాం' అని వివరించాడు మాత్స్.

మన దేశంలో గదులుతుడిచే పనివాళ్లు దసరా మామూళ్లు అడిగి, సలాముకొట్టడమే ఎరుగుదును గాని: ఇల్లా ఎదురు పిలవడం నాకు వింతగానే ఉంది.

పిచ్చుక గూటిమీదికి భాగీరథి ప్రవహించినట్లు మా లబ్బరేటరీ డైరెక్టరు విల్లీ స్ట్రాఫ్జన్ ఆవిడ ఇంట్లోకి దారి తీశారు, అందరినీ కరచాలనంతో ఆహ్వానించింది ఆవిడ 'వార్సాగుండ' అంటూ ఆ మాటకి స్వీడిష్ భాషలో ప్లీజ్ అనీ, దయచేయుండి అనీ అర్థం చెప్పుకోవచ్చు.

అది మూడుగదుల ఇల్లు. డ్రాయింగు రూము చక్కగా అలంకరించిఉంది. నేలమీద తివాసీలు ఫోమురబ్బరు సోఫాలు, మూలలలో తిరుగుడు కుర్చీలు, రకరకాల అందమైన షేడ్సుతో దీపాలు, ఒకమూల టెలివిజన్, దానిమీద వీనస్ విగ్రహం. ఆ పక్కనే టెలిఫోను, కిటికీలకు, ద్వారబంధాలకు పలుచని తెరలు, బల్లమీద కేకులు, బిస్కట్లు, కాఫీ అమర్చిఉన్నాయి. మధ్యలో నాలుగు కొవ్వొత్తుల సెమ్మె. అందులో రెండు కొవ్వొత్తులు మాత్రమే వెలిగించి ఉన్నాయి. క్రిస్మస్ ఇంకారెండు వారాలు ఉన్నదని దాని అర్థమట. నాలుగువారాలుండనగా ఒక్క కొవ్వొత్తి మాత్రమే వెలిగిస్తారు. ఒక్కొక్క వారానికి ఒక్కొక్క కొవ్వొత్తిని అధికం చేస్తారు.

వంటఇల్లు ఎల్లా ఉంటుందో అని చూడడానికి వెళ్లేను. ఎలక్ట్రిక్ కుకింగ్ రేంజి, రెఫ్రిజిరేటరు, పింగాణిసామాను అమర్చిన అలమారు... రెఫ్రిజిరేటరు చూడగానే ఢిల్లీ జ్ఞాపకం వచ్చింది. అక్కడ రెఫ్రిజిరేటరును డ్రాయింగు రూములో అందరికీ కనిపించేలా పెట్టుకుంటారు. పరాగ్గా ఉండి దానిని గమనించకపోతే 'ఎండనపడి వచ్చినట్లున్నారు. ఫ్రిజ్‌లోంచి చల్లనినీళ్లు గ్లాసుడు ఇమ్మంటారా?' అని అడుగుతారు. 'ఎంతకి కొన్నారు? ఎక్కడ కొన్నారు?' వగైరా ప్రశ్నలు కనుక నువ్వు వెయ్యకపోతే తామే ఏదో సంబంధం కల్పించుకుని చెప్పేస్తారు. నిజానికి రెఫ్రిజిరేటరు స్థానం వంటిల్లు, ఆ గ్రహింపు ఎందరిలో ఉందీ?

కిటికీలోనుంచి చూస్తే దొడ్లో మంచు టోపీ పెట్టుకున్న వోల్వోకారు. ఆమె ఆ కారులోనే ఆఫీసుకి వస్తుంది.

ఇంత హంగామా ఉండాలంటే మన దేశంలో ఏ 2500 రూ. ల జీతగాడో అయిఉండాలి. పనిమనిషికి ఈ జీవన స్థాయి ఎల్లావచ్చింది? అక్కడ ఉన్నంతసేపూ నా మనస్సులో ఇదే తిరుగుతోంది, డైరెక్టరు భుజంమీద తట్టుతూ, విల్లీ విల్లీ అని పలకరిస్తూ ఆవిడ తన సమానుడితో అన్నట్లు మాట్లాడడం నాకు ఆశ్చర్యం కలిగించింది. మన దేశ పరిస్థితుల వాసన నాలో ఇంకా పచ్చిపచ్చిగా ఉంది. అందుకనే ఇవి అన్నీ వింత గొలుపుతున్నాయి. ఈ దేశంలో కారు, టెలివిజను, టెలిఫోను, ఫ్రిజ్ లేని కుటుంబంలేదు. మా లబ్బరేటరీలో పని చేస్తున్న అందరికీ కార్లు ఉన్నాయి. అందరూ కార్లు తీసుకువస్తే పెట్టుకోడానికి చోటు ఉండదని, దయచేసి ఆఫీసు బస్సుమీద రండి అంటారు. వేసవిలో చాలా మంది కార్లకి తాళంవేసి, సైకిళ్లమీద తిరుగుతారు కారు నిలుపుకోడానికి చోటు దొరక్క. సైకిలింగ్ ప్రమోషన్ క్లబ్బు అని ఒక సంస్థకూడా ఉంది. ఇవి అన్నీ మనకి ప్రిస్టేజిసింబల్సు. వాటిని ప్రదర్శించడానికి సిగ్గుపడకపోగా అతి ప్రయత్నం జరుగుతుంది.

ఆవిడకి తొమ్మండుగురు పిల్లలు, 27 మంది మనవలూనూ, వాళ్లఫోటోలు



చల్లని నీళ్ళు ఒక గ్లాసుడు ఇమ్మంటున్నారా?!

గోడని వేలాడదీసి ఉన్నాయి. మరి ఒక్కరూ కనిపించరే? ఇంత ఇంట్లోనూ ఈవిడ ఒక్కర్తే ఉంటున్నారా? అన్న నా సందేహానికి వోర్‌బ్లోమ్ సమాధానం ఇచ్చాడు.

'మా దేశంలో పిల్లలు తల్లిదండ్రుల దగ్గర ఉండరు. కొంత వయస్సువచ్చాక వేరుగా వెళ్ళిపోతారు.'

'ముసలివాళ్ళకి జీవనోపాధి?'

'67 ఏళ్ళ వరకూ పనిచేసి రిటైరు అవుతారు. పింఛను వస్తుంది. అసలేమీ పనిచేయని ముసలివాళ్ళకు కూడా పింఛను ఏడాదికి 5000 క్రౌనులు ఇస్తుంది ప్రభుత్వం.'

'జబ్బుచేస్తే?'

'టెలిఫోనుచేస్తే చాలు, ఉచితంగా వైద్య సౌకర్యం.'

'స్వయంగా వండుకు తినలేని ముసలితనం అయితేనో?'

'అటువంటి వాళ్ళకి వేరే ఇళ్ళు కట్టింది మా ప్రభుత్వం, అక్కడ ఉచితంగా అన్ని సౌకర్యాలూ ఉంటాయి. పిల్లలు ఎప్పుడేనా వెళ్ళి చూచిరావచ్చు. ఒకళ్ళమీద మరొకళ్ళు ఆధారపడవలసిన దుస్థితి మాకులేదు.'

'పిల్లలతోటే, మనుమలతోటే కలిసి ఉండాలని ముసలాళ్ళకి అనిపిస్తే?'

'ప్రతి క్రిస్మస్‌కీ కలుసుకుంటారు చాలదూ? యువకుల వ్యవహారాల్లో ముసలాళ్ళు అనవసరపు జోక్యం కల్పించుకోవడం మాకు నచ్చదు. ఈ ప్రశ్నించరు ఇల్లాకాదు అల్లా పెట్టాలనీ, ఆ స్నేహాలు ఏమిటనీ — ఇల్లాగ అయినదానికీ కానిదానికీ కల్పించుకుని సణుగుతారు ముసలాళ్ళు. కనక, వాళ్ళని వేరుగా ఉంచడమే మంచిది.' అన్నాడు ఓర్‌బ్లోమ్.

అంతవరకూ వింటూన్న స్టాఫ్‌జన్ కల్పించుకున్నారు.

'ఈ దేశంలో ముసలాళ్ళని ఐసోలేట్ చేసేశారు పూర్తిగా, ఏ ప్లేగో వచ్చినవాళ్ళని చూసినట్లు' ఆయనకి 60 ఏళ్ళు దాటేయి. అదీ కారణం. మిగిలినవాళ్ళంతా గప్‌చిప్‌గా ఊరుకున్నారు.

'ఇది యువకుల రాజ్యం, యువకుల కాలం. ముసలాళ్ళకి విలువలేదు' అన్నారు ఆగి ఆగి.

తరువాత ఇంటికి వెడుతూంటె మాత్సే అన్నాడు. 'మా దేశంలో అందరికీ అన్ని సౌకర్యాలూ ఉన్నాయి. కాని, ఎవరికీ తృప్తి లేదు. ఇంకా ఏమిటేమిటో కావాలంటారు.

'వేలా స్వేన్‌సన్ మొగుడు అయిదేళ్ళ క్రితం పిస్తోలుతో కాల్చుకుని చచ్చిపోయాడు. ఏమిటి కారణమో ఎవరికీ తెలియదు. మొగుడు పోయినందుకు ఆవిడకి నెలకి వెయ్యి క్రౌనులు పింఛను వస్తుంది. మన అబ్జర్వేటరీలో వారానికి మూడురోజులు మాత్రమే పనిచేసినందుకు ఏడువందల క్రౌనులు వస్తాయి. ఏ అయిదువందలో ఆదాయపు పన్నుపోగా మిగిలినది ఆవిడకి చాలు.'

(ఇంకా ఉంది)




అన్నానికి బదులు

## కాలీఫ్లవరు వేసి రొట్టెలు

రెండు చిన్నసైజు కాలీఫ్లవర్లు, గోధుమపిండి, రెండుమూడు ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు, గరం మసాలాపొడి, కొత్తిమీరి, ఉప్పు, వేపడానికి నూనెగాని, డాల్డాగాని.

పిండి జల్లించి కలిపి అట్టే పెట్టుకోవాలి. కాలీఫ్లవరు బాగా కడిగి (మరుగుతెన్న ఉప్పునీళ్ళలో పువ్వు ముంచితే పురుగులుంటే వచ్చేస్తాయి) చిన్నచిన్న ముక్కలుగా తరుక్కోవాలి. ఉల్లిపాయి, పచ్చిమిరపకాయలు కూడా తరిగి అట్టే పెట్టుకోవాలి. తగినంత ఉప్పు, గరం మసాళా పొడివేసి బాగా కలియపెట్టి అట్టే పెట్టుకోవాలి.

గోధుమపిండి చిన్నచిన్న ఉండలు చేసుకోవాలి. చిన్నసైజు పూరీలులా వత్తుకుని ఒక పూరీమీద రెండు చెంచాల కాలీఫ్లవర్ కూరవేసి పైన యింకో పూరీపెట్టాలి. అంచులు గట్టిగా నొక్కేయాలి. అప్పుడు నెమ్మదిగా తిరిగి వత్తాలి. కాలీఫ్లవరు పైకి వచ్చేయకుండా జాగ్రత్తగా వత్తాలి. ఈ చపాతీలని మామూలు రొట్టెలు కాల్చినట్టే కాల్చుకోవాలి. వాటిలో ఒకసుఖం ఉంది. వేరేకూర అక్కరలేదు. ఏదైనా ఊరగాయి ముక్క ఉన్నా చాలు. కావాలంటే సెనగపిండితో బాంబెచెట్నీ చేస్తే బాగుంటుంది.

—కె. ఆర్.



'విప్లవం వర్ధిల్లాలి'లో రంగారావు, శాంతకుమారి, శివాజీగణేశన్

<u>చిత్రసమీక్ష:</u>

# విప్లవం వర్ధిల్లాలి

డబ్బింగ్ చిత్రాలకు వ్యయప్రయాసలు తక్కువ. సాధారణంగా పరిశ్రమలో అడుగెట్టిన కొత్తవారు డబ్బింగ్ చిత్రాలతోనే అనుభవం సంపాదించుకుంటూ వుంటారు. ఈ మధ్యన విడుదలయ్యే కొన్ని డబ్బింగ్ చిత్రాల కలెక్షన్సు స్ట్రెయిట్ చిత్రాల తలదన్నేస్తున్నాయి. ఇది మన నిర్మాతల శక్తిసామర్థ్యాలకి, చిత్రాల స్థాయికి, ప్రేక్షకుల ఆదరణకి ఒక ఉదాహరణ !

శ్రీధర్ నిర్మించిన 'సివన్దమణ్' తమిళనాడులో గొప్ప చరిత్రని సృష్టిస్తుందను కున్నారు. విదేశాల సౌందర్యాన్ని మనవారికి పరిచయం చేసిన శ్రీధర్‌ని జనం అభినందించక పోలేదు!

అదే చిత్రాన్ని కలర్‌లోనే 'విప్లవం వర్ధిల్లాలి' పేరుతో యువనిర్మాత వై. కన్నయ్య తెలుగువారికి సమర్పించారు. కథ ఇప్పటిది కాదు. చారిత్రక ఆధారాల జోలికి — పోకుండా — కథని పట్టించుకోకుండా వుంటే ప్రేక్షకులకు ఈ చిత్రం నిజంగా కన్నుల పండుగే అనొచ్చు. చిత్రీకరణ అంత రమ్యంగా వుంది. అనువాద చిత్రాల్లో సంగీత సాహిత్యాల గురించి చెప్పకూడదు గాని కొన్ని పాటల బాణీలు మంచి పసందుగా వున్నాయి కనక, అంతకు మించిన దృశ్యాలు కళ్లకు కనిపిస్తాయి గనక చిత్రం చూడ ముచ్చటగానే వుంటుంది.

భారీఎత్తున నిర్మించిన ఈ చిత్రాన్ని తెలుగు చెయ్యడానికి కూడా నిర్మాతలు ఎక్కువ శ్రద్ధ తీసుకున్నట్టు అస్యంతమూ అనిపిస్తుంది. ముఖ్య తారాగణంలో కాంచన, శివాజీగణేశన్, యస్. వి. రంగారావు, శాంతకుమారి, నాగేష్, మొదలైన వారున్నారు.

ఆరుద్ర రచన చేశారు. సంగీతం యం. ఎస్. విశ్వనాథం. నవయుగ విడుదల

—సితరాజా.

# సినిమా

## భలేఎత్తు చివరికి చిత్తు

ప్రముఖ నిర్మాత శ్రీ ఎస్. భావనారాయణ మైసూరు ప్రిమియర్ స్టుడియోలో చిత్రనిర్మాణాన్ని ప్రారంభించి ఒక షెడ్యూలు పూర్తిచేశారు. శ్రీ భావనారాయణ వ్రాసిన కథకు, పద్మరాజు మాటలను సమకూర్చారు. శ్రీ వేదాంతం రాఘవయ్య దర్శకత్వంలో తయారయ్యే యీ చిత్రానికి 'భలే ఎత్తు చివరికి చిత్తు' అని పేరు పెట్టారు కాంతారావు ఒక కొత్త తరహా పాత్రను పోషిస్తున్న యీ క్రయిం థ్రిల్లర్‌లోని ప్రధాన పాత్రలను రాజశ్రీ, విజయలలిత, రాజబాబు, రామ్మోహన్, బాలయ్య, రావికొండలరావులు ధరిస్తున్నారు శ్రీ ఎస్. వి. నరసింహారావు నిర్మిస్తున్న యీ చిత్రాన్ని పూర్ణా పిక్చర్స్ విడుదలచేస్తారు.

* * *

'పాండవ వనవాసం' చిత్రం వసూళ్లలో రికార్డును సృష్టించింది. ఆచిత్ర నిర్మాత శ్రీ ఏ. ఎస్. ఆర్. ఆంజనేయులు మరి కొన్ని మంచి చిత్రాలను సమర్పించగలరని ఆశించాం. కాని గత నాలుగుసంవత్సరాలకాలంగా ఆంజనేయులుగారు యితర కార్యక్రమాల్లో నిమగ్నులై వుండడంవల్ల, చిత్రనిర్మాణంలో కొంత జాప్యం జరిగింది. ఇప్పుడు మాధవీ ఆర్ట్సు ప్రొడక్షన్స్ పేరిట శ్రీ ఆంజనేయులు ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. షూటింగు మే 26 న ప్రసాద్ స్టుడియోలో ప్రారంభమైంది. ఎస్వీ రంగారావు యింటిసెట్టులో ఒకరోజు వర్కు జరిగింది. ఈ చిత్రానికి ఎన్. ఆర్. నంది రచనను, ఘంటసాల సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, మారన్న శిల్పాన్ని నిర్వహిస్తున్నారు చిత్రంలోని ముఖ్య పాత్రలను శోభన్‌బాబు, ఎస్వీరంగారావు, కాంచనలు పోషిస్తున్నారు. 'అర్ధరాత్రి' చిత్రాన్ని ప్రతిభావంతంగా డైరెక్టుచేసిన



“శతదేవిలో” కె. ఆర్. విజయ

పి. సాంబశివరావు యీ చిత్రానికి దర్శకత్వాన్ని చేపట్టారు.

* * *

సుప్రజా పిక్చర్స్ వారి 'కిలాడీ సింగన్న' షూటింగు విశాఖపట్నం వీధుల్లో యిటీవల జరిగింది.

'ముంతకిందపప్పు, ఎలావుందో చెప్పు' పాటను చంద్రమోహన్, రేణులపై దర్శకుడు అయ్యన్‌మూర్తి, కన్నప్ప సహాయంలో చిత్రీకరించారు. కారు ఛేసింగు కూడా పిక్చరైజు చెయ్యబడింది. ప్రేక్షకులు వేల సంఖ్యలో వచ్చి షూటింగును భంగపరచకుండా చూచినట్లు దర్శక నిర్మాత మూర్తి వెల్లడించారు. ఇప్పటికి ఎనిమిదిరీళ్ల చిత్రం పూర్తయింది. పూర్ణా పిక్చర్స్ ద్వారా విడుదలయ్యే 'కిలాడీ సింగన్న'లోని ముఖ్యపాత్రలను ఎస్వీరంగారావు, హరనాథ్, నాగభూషణం, వాణిశ్రీ, విజయశ్రీ, రాజబాబు, రేణులు ధరిస్తున్నారు

## తీరికలేని తార

నెలకు 29 రోజులు షూటింగులో పాల్గొనే తార ఎవరనుకుంటున్నారు? 'మొల్ల' పాత్రలో జీవించిన వాణిశ్రీయే. నేను ఆమెను చూద్దామని నెలరోజులుగా ప్రయత్నిస్తున్నాను. ఎప్పుడు వెళ్లినా, అవుట్‌డోర్‌కు కొడైకెనాల్, గోవా, ఊటికి వెళ్లిందనే సమాధానమేవచ్చేది. ఆమె హీరోయిన్‌గా నటిస్తున్న అయిదు కలర్ చిత్రాలు దాదాపు పూర్తి అయ్యే స్టేజిలో వున్నాయి. తెలుగు, తమిళ చిత్రాల్లో పెద్ద హీరోలతో నటించడం వల్ల, అందరికీ కాల్‌షీట్లు సర్ది, తను రెస్టు తీసుకోకుండా వర్కు చేస్తున్నం

# దాదాసాహెబ్ ఫాల్కే

భారతీయ చలన చిత్ర పరిశ్రమ యొక్క మార్గదర్శిగా పరిగణింపబడే దాదాసాహెబ్ ఫాల్కేగారి శతజయంతి ఉత్సవాలు బొంబాయిలో వైభవంగా జరుపబడింది 1870 లో నాసిక్‌లో జన్మించిన ఫాల్కే 1912 లో చిత్ర పరిశ్రమలోని అన్ని శాఖలయొక్క లక్షణ లక్ష్యాలను లండన్‌లోని 'శసిల్ ఎడ్వర్డ్' అను నిర్మాత దగ్గర నేర్చుకొని 'కృష్ణలీల' చిత్రాన్ని ప్రప్రథమంగా భారతదేశంలో నిర్మించారు.

### ఎడ్లబండిలో ప్రొజెక్టరు

'హరిశ్చంద్ర' చిత్రాన్ని నిర్మించి ఒకే ఒక ప్రింటును ఎద్దుబండిలో ప్రొజెక్టరునుపెట్టి బొంబాయి రాష్ట్రమంతటా ప్రదర్శించి డబ్బు గడించిన ధీశాలియే ఫాల్కే. ఆ తర్వాత ఫాల్కే అనేక చిత్రాలను నిర్మించారు. చిత్రరంగం దిన దిన ప్రవర్ధమానమైనది.

### మొదటి నాయిక

కుటుంబస్త్రీలను సినిమాలలో నటింపచేయవచ్చునని నిరూపించిన మొదటి వ్యక్తి శ్రీ ఫాల్కే. 'మోహిని భస్మాసుర' చిత్రంలో 'కమల' అనెడి మరాఠీ యువతిని కథానాయికగా పరిచయం చేశారు. ఆ రోజులలో ఉదయం 7 గంటల నుండి అర్ధరాత్రి వరకు సినిమా ప్రదర్శనలు వుండేవట.

### మార్గదర్శకుడు

సినిమా ప్రపంచం క్రొత్త మార్గాన్ని అనుసరించింది. కాలం మారింది, కళాప్రపంచం మారింది మన సముదాయం ఫాల్కేను మరచిపోయింది.

'నాకు సినిమా రంగం మీద విసుగు పుట్టింది. నేను డబ్బుకోసం చిత్రాలను నిర్మించలేను చక్కటి యితివృత్తాలను వుత్తమ కళలను నిర్మించలేనపుడు ఈ పరిశ్రమలో నేను వున్నా ఒకటే



లేకున్నా ఒకటే అని భావిస్తున్నాను' అని ఫాల్కే ఆనాడన్న మాటలు ఎన్నటికీ మన స్మృతి పథంలో మెదలుతుంటుంది. సాధారణంగా జన్మించి సౌకర్యంగా జీవించిన ఆ మార్గదర్శి తన అంతిమ యాత్రను శుష్కదరిద్రంలో ముగించడం విచారకరమైన విషయం.

—శ్రీనివాస్

# అభివృద్ధి చెందు గృహిణిగా విస్తృత వహా

బాల్యంలో తలిదండ్రులవద్ద - యవ్వనంలో భర్తవద్ద. వృద్ధాప్యంలో కొడుకులవద్ద ఏవయస్సులో గాని ఒకరి అండన స్త్రీ బ్రతకాలని అంటారు.

అంతేకాదు—

లతకు చెట్టు ఏలా ఆలంబనగా వుంటుందో స్త్రీకి పురుషుని అండ విధిగా వుండాలనేది నానుడి. కాని తరతరాలుగా వస్తున్న ఈ ఆచారాల్ని, తుత్తునియలు చేసింది - కమల.

ఎవరా కమల? ఏమిటా కమలకృషి

ఈ ప్రశ్నలకొచ్చే జవాబులసారాంశమే "పసిడిమనసులు" గాథ:

## మనిషిలో నిమంచితనం

కనిపించిన ప్రతి ఆడపిల్ల వెంబడిపడి అల్లరిచేస్తూ నకిలీ పోలీసు, టాక్సు అధికారుల వేషాలువేసి ఎన్నో అవినీతి పనులు సునాయాసంగా చేసుండిన శేఖర్ బాహ్యాచర్యలకన్నా అతని అంతరంగంచూచే కమల అతని యెడల నమ్మకం, విశ్వాసం వుంచుకొనింది. మమతలు పెంచుకొనింది.

## మనిషి వంకర, మాను వంకర మార్చవచ్చునా?

మనిషి వంకర,మాను వంకర మార్చడం కష్టమని, నువ్వు చేసుకొనేది పెళ్ళికాదు ఆత్మహత్య అని అన్నగారు నిందిస్తున్నా లెక్కచేయకుండా మానవత్వంమీద నమ్మకంతో కన్నవారిల్లు నిరాధారంగా విడిచి కోరినవారి వదకు నిర్భీతిగా వచ్చి పెండ్లి చేసుకొన్నది.

పెళ్లాడిన భర్త - మనసులో కోరికలు రేసులో గుఱ్ఱాల్లా పరుగు తీస్తున్నాయని



తపన పడుతున్నా- ఆగుఱ్ఱాల్ని కాస్తా కట్టేయండనీ- అల్లరి చేస్తే బెత్తం తీసుకొస్తానని- అందర్నీ అదిలించి-బెదిరించి బ్రతుకుతుండిన ఆవ్యక్తిని బుజ్జగించి-పసిపాపలా లాలించి మంచిదారికి తీసుకొచ్చింది.

## వైరుధ్యాలు

శేఖరుకు కావాల్సింది-అనుభవించేందుకు భార్య, కాని కమలకు కావాల్సింది- నలుగురిలో గుర్తింపబడే వ్యక్తిగా తన భర్త తయారు కావడం. అందుకే అహర్నిశలూ పగలూ - రాత్రి అనక కృషిచేసింది.

బి. ఏ. చదివి ఉద్యోగం దొరకక-కని పెంచిన వారికి బరువుగా తయారవలేక వారి వద్ద మాట పడలేక ఆత్మహత్య చేసుకున్న తమ్ముడూ శ్రీధర్ అనుక్షణంగుర్తుకొస్తుంటే శేఖర్ దిగాలుపడి పోయేవాడు.

అందుకే—

నిరాశ, నిరుత్సాహం మనిషిని క్రుంగదీస్తాయని కమల బోధపర్చింది. ఉత్సాహం,పట్టుదల-సంకల్పబలంతో డిగ్రీలు లేకుండానే బ్రతుకు తెరువు చూచుకోవచ్చని ఎరుకపర్చింది. ఆత్మస్థైర్యం కలిగించింది.

## బువ్వపెట్టని ఆదర్శం

శేఖర్ :- ఏంరా శ్రీధర్ ! ఉద్యోగాల వేటకుఅప్పుడే తెల్లవారిందా? నాయనా ! తిరగడానికి డబ్బులున్నాయా ? కావాలా ?

శ్రీధర్ :- లేవు. నువ్విచ్చినా పుచ్చుకోను.

శేఖర్ :- ఆహా ! ఎంత పౌరుషం రా తమ్ముడూ - ప్రజల్ని, ప్రభుత్వాన్నికళ్లుగప్పి మోసంచేసే వాళ్ళ మోచేతిక్రింద నీళ్లు తాగుతావేగాని-నేనిచ్చే డబ్బు మాత్రం ముట్టుకోవు. ఒరే తమ్ముడూ యీ ఆదర్శాలూ, ధర్మసూత్రాలూ బువ్వ పెట్టవురా !



"అబ్బాయ్'....మూణ్నెళ్ళుగా సంబంధాలు చూస్తున్నాం !'...నీకు ఒక్క-అమ్మాయి కూడా నచ్చటం లేదు! "నీ కెలాంటి అమ్మాయి కావాలో చెప్పరాదూ !"
"కమలలాంటి అమ్మాయిని చూడు ! పక్కింటి కమలకాదు !
" పసిడిమనసులు కమల ! !'
పసిడి మనసులు కమల రంభా ? ఊర్వశా ?....

ఈ చిత్రానికి అనిల్ ప్రభాస్ ఎంటర్ ప్రైసెస్‌వారు సోల్ డిస్ట్రిబ్యూటర్లు.నవయుగ ఫిలిమ్సువారు విడుదల చేశారు.

# తున్న సమాజంలో

# తున్న స్త్రీ బాధ్యతలు



## కాలం తిరిగి వెనక్కు రాదు

వృథాచేసిన కాలం తిరిగి తీసుకురావడం కష్టం. గడచిపోతున్న కాలంతో పాటు వచ్చే అవకాశాలుకూడా చేయిజారిపోతాయి.

ఈ నీతి తన భర్తకేకాదు. తన భర్త స్నేహితులకూ నేర్పి — వార్ని చిత్తశుద్ధి కార్యదీక్షగల మనుష్యులుగా మార్చింది — కమల.

## సిద్ధాంతాలుకాదు ఆచరణకావాలి

"నీటిచుక్క పెనంమీద పడితే ఆవిరైపోతుంది. తామరాకుమీదపడితే ఆణిముత్యంలా మెరుస్తుంది. కాని నిష్ప్రయోజనం అది. ముత్యపు చిప్పలో పడ్డప్పుడే నీటిచుక్క నిర్మలమైన ముత్యమవుతుంది."

ఇవి — కమల, భర్తకు, భర్త స్నేహితులకు నేర్పిన హితవు. తాను చెప్పిన సూత్రాన్ని తనే ఆచరించి చూపింది.

మనిషి ఎంతహీనదశలోవున్నా ఉత్తమ ఖిల్లాలు అదుపులో — నిర్మలమైన ముత్యంలా తయారౌతాడని ఆచరించి నిరూపించింది — కమల.

రౌడీ, జులాయి శేఖర్ తన కళ్ళముందే భారీఎత్తున వ్యక్తిత్వం పెంచుకొని భారత ఉత్తమ పౌరుడుగా పెరుగుతూంటే చూచి గర్వపడింది.

తనకలలుపండినందుకు మురిసి పోయింది

అందుకనే నాటి అబల — నేడు సబల అయింది.

ఏ వయస్సులోనైనా భావి భారత పౌరులను తయారు చేయడంలో స్త్రీ ప్రముఖ పాత్ర వహిస్తుందని నిరూపించింది.

'అబ్బాయి చదువు పూర్తి
కాకుండా పెళ్ళిచేస్తే....
చదువుకాస్త
గంగలో కలుస్తుంది!
'ఏమో....ఎవరు చెప్పగలరు?
వచ్చేకోడలు....పసిడిమనసు
లలో కమలలాంటి దవకూడదా?....'
ఇంతకీ కమల ఎలాంటిదో?....

ప్రతి గృహిణి చూడదగ్గ ఉత్తమ చిత్రం

# నాటి అబల-నేటి సబల

★ అసాధ్యాన్ని సాధ్యం చేయడం స్త్రీలకే తగుతుంది!

★ తప్పుదోవ పట్టిన మగాణ్ణి సరిదిద్ద గలిగింది స్త్రీ మాత్రమే!



ఉషశ్రీ ప్రొడక్షన్స్

# పసిడి మనసులు

నిర్మాత: పి. చిన్నపరెడ్డి M.Sc.,
దర్శకత్వం: పి. సుబ్రహ్మణ్యం

SUVARNA



"ఖడ్గవీర"లో కాంతారావు, రాజశ్రీ

దుకు వాణిశ్రీని అభినందించాలి. 'కష్టేఫలి' అన్న నానుడి వాణిశ్రీపట్ల నూరు శాతం వర్తిస్తుంది. 1970 సెప్టెంబరు వరకు వాణిశ్రీకి ఒక్క రోజు కూడా ఖాళీ లేదంటే, మీరే వూహించండి? నేను ఆమెను చూద్దామని మే 26న వెళ్ళాను. అప్పుడే ఆమె కొడైకెనాల్ నుండి వచ్చింది. అజంతా ఆర్ట్సువారి తమిళ చిత్రంలో పాల్గొని వచ్చినట్టు చెప్పింది. మీరు కొత్తగా అంగీకరించిన తెలుగు చిత్రాలేమిటని అడిగాను. శ్రీ గిడుతూరి సూర్యం డైరెక్టు చేస్తున్న

## సినిమా

శ్రీ సరస్వతి చిత్రవారి 'కథానాయకురాలు' లక్ష్మీకళాచిత్ర నిర్మించనున్న సాంఘిక చిత్రం అని చెప్పారు.

* * *

లక్ష్మీకళాచిత్ర సంస్థకు గుప్తాగారు అధినేత, శ్రీ బి. ఏ. సుబ్బారావు దర్శకులు, పినిసెట్టి రచన సాగిస్తున్నారు. నాయకపాత్రను పోషించడానికి శ్రీ ఎన్. టి. రామారావు అంగీకరించారు. నాయికగా వాణిశ్రీ నటిస్తుంది. షూటింగు సెప్టెంబరులో 'స్టార్టు' కాగలదని తెలుస్తోంది.

## ఆర్వో కలర్‌లో దసరా బుల్లోడు

జగపతి ఆర్టు పిక్చర్సు ఆర్వోకలర్‌లో భారీఎత్తున నిర్మిస్తున్న 'దసరాబుల్లోడు' షూటింగు రెండు షెడ్యూల్సు పూర్తయ్యాయి. శ్రీ వి బి. రాజేంద్రప్రసాద్ దర్శకత్వం నెరపుతున్న మొదటిచిత్రమిది. ఇప్పటికి అయిదుపాటలు చిత్రీకరించబడ్డాయి. అమలాపురందగ్గర నాలుగు పాటలు నాయికా నాయకులపై (వాణిశ్రీ అక్కినేనిగార్లు) చిత్రీకరింపబడ్డాయి. ఒకపాటకు శ్రీ నాగేశ్వరరావు, పద్మనాభం, నాగభూషణంగార్లు అభినయించారు. ఇవిగాక 'దసరావేషాల'ను బ్రహ్మాండంగా పిక్చరైజు చేసారు. ఇంతవరకు తీసినది నాలుగురీళ్లు వచ్చింది. అవుట్‌డోర్ వర్కు చాలావరకు పూర్తయింది. ఇన్‌డోర్ షూటింగు సెప్టెంబరుకు పూర్తి కాగలదని తెలుస్తోంది. ఈ చిత్రంలో 9 పాటలుంటాయి, అన్నీ రికార్డు కాబడ్డాయి. హైదరాబాదు సారధి స్టూడియోలో నిర్మింపబడుతున్న 'దసరా బుల్లోడు' చిత్రంయొక్క సాంకేతిక శాఖను శ్రీ వెంకటరత్నం (ఛాయాగ్రహణం) శ్రీ సంజీవి (కూర్పు), శ్రీ జి వి. సుబ్బారావు (కళ), మహదేవన్ (సంగీతం), హీరాలాల్ (నృత్యం) పొదరి (మేకప్) గార్లు నిర్వహిస్తున్నారు శ్రీ వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకత్వంలో నిర్మిస్తున్న యీ చిత్రంలోని ప్రధాన పాత్రలను నాగేశ్వరరావు, రంగారావు, గుమ్మడి, నాగభూషణం, వాణిశ్రీ, చంద్రకళ, అంజలీదేవి, సూర్యకాంతం, రాధాకుమారి, బేబి బ్రహ్మేశలు ధరిస్తున్నారు.

* * *

శ్రీ ఏ. ఎల్. శ్రీనివాసన్ 'పాకెట్ మార్' చిత్రాన్ని తమిళంలో 'తిరుడాదే'గా నిర్మించి విశేషలాభాలను గడించారు. శ్రీ ఎం. జి. ఆర్. ను కథానాయకుడిగా నిలబెట్టిన సాంఘిక చిత్రం 'తిరుడాదే'. ఇప్పుడు శ్రీ కాంత్ ప్రొడక్షన్స్

## సినిమా డైరీ

● ఫల్గుణా ప్రొడక్షన్సువారి "జగత్ జెట్టీలు" జూన్ 18న లక్ష్మీ ఫిలింస్‌ద్వారా విడుదల అవుతుంది.

● ప్రొడ్యూసర్సు కంబైన్సువారి "పూజకొక్కి పురుషుడు" షూటింగ్ జూన్ 1 నుండి 7 వరకు జెమినీ స్టుడియోలో జరిగింది. వాణిశ్రీ, నాగేశ్వరరావులు పాల్గొన్నారు.

● నవశక్తి పిక్చర్సు ప్రసాద్ స్టుడియోలో జూన్ 9, 10 తేదీలలో వాణిశ్రీ రామారావులకు సంబంధించిన డ్యూయెట్ పాటను చిత్రీకరించారు.

● శ్రీ అక్కినేని నాగేశ్వరరావు జూన్ 1 నుండి 7 వరకు మద్రాస్‌లో అశోక్ మూవీస్, ప్రొడ్యూసర్సు కంబైన్సు షూటింగ్‌లో పాల్గొన్నారు.

● బాబూ పిక్చర్సు "బంగారు తల్లి" షూటింగ్ ఏ. వి. యం. స్టుడియోలోను, అవుట్‌డోర్ లొకేషన్‌లోను జూన్ 1 నుండి 5 వరకు జరిగింది. జమున జగ్గయ్యలుగాక తారాగణమంతా పాల్గొన్నారు.

● మాతా పిక్చర్సువారి "పెద్దలు మారాలి" జూన్ 6న ప్రారంభమైంది. జమున, హీరో నాగేశ్వరరావుగారి కుమారుడు పాల్గొన్నారు.

# మీకు తెలుసా?

శ్రీధర్ నిర్మించిన 'ధర్తీ' హిందీ చిత్రంలో శివాజీగణేశన్ ఒక ముఖ్యపాత్రను ధరించి హిందీ డైలాగులను తనే మాట్లాడాడు.

ప్రముఖ దర్శకుడు సత్యజిత్‌రాయ్ నేటి యువతీయువకుల జీవిత సమస్యను చలన చిత్రంగా నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను విద్యార్థినీ, విద్యార్థులు ధరిస్తున్నారట.

పి. బి. శ్రీనివాస్ ఇటీవల తమిళంలో ఒక పాటను గానమేఘం పేరిట వ్రాశారట.

హిందీ నటుడు రాజేష్‌ఖన్నా నటించిన ప్రతి చిత్రం సిల్వర్‌జూబ్లీ జరుపుకొంది. ఇప్పుడు ఆయన రేటు ఆకాశాన్నంటుతున్నదట.

నటి షర్లీ టెంపల్ ఇంటిచుట్టు పది అడుగుల ఎత్తుగల కాంపౌండ్ వాల్‌ను కట్టిస్తున్నారట.

'తిరుడదొంగ'ని తెలుగులో నిర్మిస్తున్నారు. సి. ఎస్. రావ్ దర్శకత్వం నెరపుతున్న యీ చిత్రంలో రామారావు నాయకుడు; విజయనిర్మల నాయిక, ఇతర ముఖ్య పాత్రలను చలం, రామకృష్ణ, సత్యనారాయణ, మణిమాల, జగ్గారావు, ప్రభృతులు పోషిస్తున్నారు. ఈ సంస్థకానికి భమిడిపాటి రచన, టి. వి. రాజు స్వరకల్పన చేస్తున్నారు. చిత్రం సగానికి పైగా పూర్తయింది.

## శ్రీదేవి

బి. ఎస్. నారాయణ నిర్దేశకత్వంలో ఆర్. ఎస్. నారాయణ నిర్మిస్తున్న 'శ్రీదేవి' దాదాపు పూర్తయింది. టైటిల్ పాత్రను బేబీ రోజారమణి ధరిస్తోంది. పద్మనాభరావు వ్రాసిన కథకు, బొర్ర ముంత శివరామకృష్ణయ్య మాటలను సమకూర్చారు. సంగీతాన్ని జి. కె. వెంకటేష్, సహకార దర్శకత్వాన్ని కోటేశ్వరరావు నిర్వహిస్తున్న యీ చిత్రంలోని ముఖ్యపాత్రలను హరనాథ్, కె. ఆర్. విజయ, గుమ్మడి, సూర్యకాంతం, రాజబాబు, సంధ్యారాణి, అల్లురామలింగయ్య, రుక్మిణి, సాక్షి రంగారావు, రాధాకుమారి, ఆనందమోహన్, ప్రభృతులు ధరిస్తున్నారు.

* * *

శ్రీ ఎన్. టి. రామారావు కథానాయకుడిగా నటించిన మురుగన్ బ్రదర్స్‌వారి 'చిట్టిచెల్లెలు' విడుదలకు సిద్ధంగా వుంది. రామారావుగారి అనుంగు చెల్లెలిగా వాణిశ్రీ, అల్లుడిగా హరనాథ్, భార్యగా రాజశ్రీ, తండ్రిగా గుమ్మడి నటించిన యీ సాంఘికానికి గుహనాధన్ కథను, డి. వి. నరసరాజు మాటలను వ్రాశారు. ఎం. కృష్ణన్ దర్శకత్వంలో తయారయిన యీ చిత్రంలోని సహాయ భూమికలను రేలంగి, పద్మనాభం, రాజశ్రీలు ధరించారు. రాజేశ్వరరావు సంగీతాన్ని సమకూర్చిన యీ చిత్రాన్ని విజయ పిక్చర్స్ విడుదల చేస్తారు.

* * *

'సతీ అనసూయ' చిత్రం 'బ్లాక్ అండ్ వైట్'లో వచ్చింది. టైటిల్ పాత్రను అంజలీదేవి పోషించింది. ఇప్పుడదే 'అనసూయ'ను శ్రీ కాంత్ అండ్ శ్రీ కాంత్ ఎంటర్ ప్రైజస్ కలర్‌లో తయారు చేస్తున్నారు. అనసూయ పాత్రను జమున, నర్మద భూమికను శారద, అనసూయ భర్తగా కాంతారావు, నర్మద భర్తగా సత్యనారాయణ, నాగ



"విజయం మనదే"లో దేవిక, రామారావు

బారేనిత్తున్న నిర్మిస్తున్న 'కోడలు దిద్దిన కాపురం' విడుదలవుతుంది. డి. వి. నరస రాజు మాటలను టి. వి. రాజు సంగీతాన్ని నిర్వహిస్తున్న ఈ చిత్రానికి యోగానంద్ దర్శకుడు. చిత్రంలోని ప్రధాన పాత్రలను ఎన్.టి. రామారావు, జగ్గయ్య, రేలంగి, పద్మనాభం, నాగభూషణం, సత్యనారాయణ, ధూళిపాళ, మిక్కిలినేని, త్యాగరాజు, సావిత్రి, వాణిశ్రీ, సూర్యకాంతం, సంధ్యారాణి, విజయలలితలు ధరిస్తున్నారు. విజయాపిక్చర్సు విడుదల

* * *

విశ్వభారతి ప్రొడక్షన్స్ సారధ స్టూడియోలో నిర్మించనున్న సాంఘిక చిత్రానికి ముళ్ళపూడి కథకుడు. ప్రత్యగాత్మ దర్శకుడు. ఈ చిత్రంలో జమున, నాగేశ్వరావు నాయికా నాయకులుగ నటిస్తున్నారు.

* * *

క్యారెక్టర్ నటుడు నాగభూషణం 'పావమన్నిప్పు' చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి భీమ్‌సింగ్ దర్శకత్వాన్ని, కోదండపాణి సంగీతాన్ని, పద్మరాజు మాటల కర్తృత్వాన్ని నిర్వహిస్తున్నారు. ఎన్. టి. రామారావు కొత్త తరహా పాత్రను ధరిస్తున్న యీ చిత్రంలోని సహాయపాత్రలను కాంతారావు, నాగయ్య, నాగభూణం, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, లక్ష్మి, రాజశ్రీలు ధరిస్తున్నారు. ఒకనాటి విఖ్యాత హీరో సి. హెచ్. నారాయణరావు ఒక ముఖ్య భూమికను ధరిస్తున్నారు.

## కంచు కాగడాలో పృథ్వీరాజ్

ప్రఖ్యాత హిందీ నటుడు పృధ్వీరాజ కపూర్ విశ్వశాంతి విశ్వేశ్వరరావు నిర్మించనున్న 'కంచుకాగడా' చిత్రంలో ఒక ప్రముఖ పాత్రను పోషించడం ముదావహం. తెలుగు మాటలను తనే చెప్పడానికి అంగీకరించి, వలసిన తర్ఫీదును పొందుతున్నట్లు తెలుస్తుంది. ఎన్. టి. రామారావుకు తండ్రిగా పృధ్వీరాజ్ నటించే ఈ కలర్ చిత్రానికి సి. యస్. రావు నిర్దేశకుడు.

* *



"జగత్ జెట్టిలు"లో గుమ్మడి, శోభన్‌బాబు

హీరో కృష్ణ పద్మాలయా మూవీస్ పేరిట సమర్పించే 'అగ్నిపరీక్ష' త్వరలో విడుదల కాబోతుంది. ఈ చిత్రానికి రచన, దర్శకత్వాన్ని, కె. వరప్రసాదరావు, ఛాయను వి. యస్. ఆర్. స్వామి, సంగీతాన్ని ఆదినారాయణరావు నిర్వహించారు. జి. ఆదిశేషగిరిరావు నిర్మించిన ఈ చిత్రంలో కృష్ణ, గుమ్మడి, నాగభూషణం, పద్మనాభం, రాజబాబు, ప్రభాకరరెడ్డి, చంద్రమోహన్, రావి కొండలరావు, ముక్కామల, కె వి. చలం, అల్లురామలింగయ్య, కాకరాల, సాక్షి రంగారావు, విజయనిర్మల, యల్. విజయలక్ష్మి, ఛాయాదేవి, పుష్పకుమారి, రాధాకుమారి, ఉదయలక్ష్మి, బేబీ శ్రీదేవి ముఖ్య పాత్రధారులు.

* * *

నటరాజన్ పిక్చర్సు నిర్మిస్తున్న క్రైం థ్రిల్లర్‌లో తమిళ హాస్యనటుడు చంద్రబాబు కడుపుబ్బ నవ్వించే 'బస్ కండక్టర్' పాత్రను నిర్వహిస్తున్నారు. జి. కె. మూర్తి రచన. కె. సి. మహా



"పచ్చని సంసారం"లో పద్మనాభం, గీతాంజలి

దేవన్ స్వరకల్పన సాగించే ఈ చిత్రానికి ఛాయాగ్రహకుడు లక్ష్మణ్ ఘోరే దర్శకత్వం వహించడం ముదావహం. చిత్రంలోని పాత్రలను హరనాథ్, రామకృష్ణ, ప్రభాకర్‌రెడ్డి, త్యాగరాజు, అల్లు రామలింగయ్య, రాజశ్రీ, పద్మనాభంలు ధరిస్తున్నారు.

* * *

నటి వాసంతి తమిళంలో హిట్ అయిన 'కన్నెపాప' చిత్రాన్ని తెలుగులో 'భలేపాప' పేరిట నిర్మిస్తున్నది కె. యస్. ప్రకాశరావు దర్శకత్వాన్ని, లల్ ఛాయాగ్రహణాన్ని, సుదర్శనం సంగీత దర్శకత్వాన్ని నిర్వహించే ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను హరనాథ్, యస్. వి. రంగారావు పద్మనాభం, రేలంగి, అల్లు రామలింగయ్య, రావి కొండలరావు, త్యాగరాజు, రమణారెడ్డి కె. వి. చలం, ప్రసాద్, కె. ఆర్. విజయ, విజయలలిత, జ్యోతిలక్ష్మి, ఛాయాదేవి, రాధాకుమారి ధరిస్తున్నారు.

* * *

రాబిన్‌హుడ్‌ను గూర్చి పుస్తకాలలో చదివుంటాం. కథగా వినివుంటాం. ఇపుడిక్కడ్ని తెరపై చూడనున్నాం. రాబిన్‌హుడ్‌యొక్క ధైర్య సాహసాలను ఇతివృత్తంగా తీసుకొని, చంద్రుడు సూర్యనారాయణ విజయరాణి మూవీస్ పేరిట ఒక స్టంట్ చిత్రాన్ని జూలై మొదటి వారంలో ప్రారంభిస్తారు. ఈ చిత్రానికి జి. కె. మూర్తి మాటలను, టి వి. రాజు సంగీతాన్ని జి. విశ్వనాథం దర్శకత్వాన్ని నిర్వహిస్తారు. నాయకీ నాయకులుగ భారతీ కాంతారావులు నటిస్తారు.





# సినివార్త

* * *

ఉత్తమ చిత్రవారు నిర్మిస్తున్న సాంఘిక చిత్రం యిప్పటికి 8 రీళ్లు తయారైంది. కె. ప్రత్యగాత్మ స్క్రీన్‌ప్లే దర్శకత్వాన్ని చేపట్టిన ఈ చిత్రానికి ఆయన కుమారుడు శ్రీనివాసరావు కథను, ఆచార్య ఆత్రేయ మాటలను వ్రాసారు కె. కుటుంబరావు నిర్మిస్తున్న ఈ చిత్రంలోని ముఖ్యపాత్రలను నాగేశ్వరరావు, జమున, జగ్గయ్య, అంజలీదేవి, పద్మనాభం, గీతాంజలి, చంద్రమోహన్, మణిమాల, రామకృష్ణ, అనితలు ధరిస్తున్నారు. ఈ చిత్రాన్ని నాగేశ్వరరావు జన్మదిన కానుకగా విడుదల చెయ్యదలచినట్టు నిర్మాత కుటుంబరావు వెల్లడించారు. శ్రీ ఫిలిమ్స్ విడుదల.

* * *

బి. ఎన్. మూవీస్ 'పచ్చని సంసారం'లో కృష్ణ, రామకృష్ణ, గుమ్మడి, పద్మనాభం, రాజబాబు, మిక్కిలినేని, ధూళిపాళ, పెరుమాళ్ళు, ప్రసాద్, సి. హెచ్. కృష్ణమూర్తి, రావి కొండలరావు, డాక్టర్ శివరామకృష్ణయ్య, ఆనందమోహన్, భీమరాజు, వాణిశ్రీ, సంధ్యారాణి, సూర్యకాంతం, గీతాంజలి, బేబీరాణి, బేబీ శ్రీదేవి, బేబీ డాలి పాత్రధారులు. నాగభూషణం, రమణారెడ్డి, నాగయ్య, రాజనాల, కె. ఆర్. విజయ అతిథి నటులు. ప్రభాకరరెడ్డి నటుడే కాదు, చక్కటి కథకుడని ఈ చిత్రం నిరూపిస్తుంది. మాటలను మద్దిపట్ల సూరి, ఛాయను వెంకటరత్నం, సంగీతాన్ని కోదండపాణి నిర్వహించారు. ఈ చిత్రంద్వారా లక్ష్మీదీపక్ అనే నూతన దర్శకుడు పరిచయమవుతున్నాడు. లక్ష్మీ ఫిలింస్ విడుదల.

—శ్రీనివాస్

**అవి-ఇవి...**

వివాహం

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖ్య ఉప సంపాదకుడు చి. ఎస్. మాధవరావుకు, యల్లాప్రగడ రామకోటేశ్వరరావుగారి కుమార్తె చి. సౌ. లక్ష్మీసులోచనకి మే 31 వ తేదీ ఆదివారం ఉదయం తెనాలిలో వైభవంగా వివాహం జరిగింది.

* * *

శ్రీమతి మీనాక్షి, శ్రీ యస్ కృష్ణస్వామి [అమల్గమేషన్స్ ప్ర. లి. మద్రాసు] గార్ల కుమారుడు చి. కె. బాలసుబ్రమణ్యన్‌కి, న్యూఢిల్లీకి చెందిన శ్రీ పి. ఆర్. మహదేవన్ గారి కుమార్తె చి. సౌ. అనంతలక్ష్మి [హేమ]కి మద్రాసు ధర్మప్రకాష్‌లో వైభవంగా వివాహం జరిగింది.

* * *

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత శ్రీ అనుమోలు వెంకట సుబ్బారావుగారి కుమార్తె చి. సౌ. క్రిష్ణకుమారికి గురజాడకి చెందిన వెంకట సుబ్బారావు గారి కుమారుడు చి. నాగేశ్వరరావుకు విజయవాడ రైస్‌మిల్లర్స్ అసోసియేషన్ హాలులో వైభవంగా వివాహం జరిగింది. పురప్రముఖులు, పరిశ్రమకిచెందిన అనేకమంది సభ్యులు ధూవరులను ఆశీర్వదించారు.

# ధర్మపథం

(23వ పేజీ తరువాయి)

డానికి దూడకు తోచ లేదు. బెంబేలుపడి మీ చేలు పాడుచేస్తున్నది. ఒక్క క్షణం మీరు ఊరకే ఉండండి. నేను దాన్ని పొలం నుంచి బయటికి రప్పిస్తాను' అని. 'బాబా' ... అభిమానంగా దూడను పిలి... అవ్వ గొంతుక విని ఆ దూడ ... చెంగున గంతులువేస్తూ పొలం నుంచి బయటపడ్డాది. అవ్వ దాన్ని ఆప్యాయంగా దగ్గిరకు తీసుకుంది.

పొలం కాపులకూ నెమ్మది కలిగింది.

దూడకూ ఆందోళన పోయింది. అవ్వకూ గుండె కుదటపడింది.

బెదరింపులకన్న ఆ ప్యాయత బాగా పనిచేస్తుంది.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad